మనం చివరివఱకూపోరాడుతాం
జయంమనదే.

మన ఆఖరి తుపాకిగుండు పేలేదాకా, మన పవిత్ర
భూమినుంచి దురాక్రమణ దారుడినమ్మక సామిద్రోహంచివరి
మనకమాసేదాకా - అందనకా — విజయగానాలతో, స్వచ్ఛంద
జీవుల దృఢ విశ్వాసంతో పవిత్రమై మరోసారి శాంతి
సౌఖ్యాలతో వచ్చే మంచిరోజుల కోసం ఎదురు చూస్తాం!

మోడెల్ టీయు 0704
4 వాల్వ్ • ఆల్ వేవ్ • 2 బ్యాండ్ ఏసి/డిసి



**murphy radio** మర్ఫీ రేడియో

NATIONAL MR 262 A

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



ఫిబ్రవరి సంచిక వెలువడింది!

# యువ

(సచిత్ర మాసపత్రిక)

విడి ప్రతి వెల రు. **0-75** సాలు చందా రు. **9-00**

టి. రామకృష్ణా రెడ్డి — పరివర్తన
కోడూరి కౌసల్యాదేవి — పంకజం
టి. వి. శంకరం — కార్మిక భయం
సి. నారాయణ రెడ్డి — శృంగార నాయికలు
పి. జె. లక్ష్మి — శ్రీమతి
డి. హనుమంతరావు — కరుణామయి
అశ్వని — మారిన విలువలు

★

## యువతీ లోకం

ఆరాధ్యుల లక్ష్మి — వివాహమంటే...
కుమారి జి. లలిత — స్త్రీ ఉద్యోగంలో మొదటి మెట్టు

## యువ కార్యాలయం

పబ్లిక్ గార్డెన్ రోడ్ :: హైదరాబాదు-1.

## అతి త్వరలో విడుదల!

కవిత కొమ్మల కెక్కి మధురాక్షరమ్ముగా
రామ రామా అన్న కలకూజితమ్మదే
ఆది కావ్యమ్మయె: ఆరఘూత్తంసుని
కవిత గావ్చిన ఆదికవియె—

# వాల్మీకి

ఎన్.టి.రామారావు
కాంతారావు రాజనాల రఘురామయ్య
పద్మనాభం రాజసులోచన లీలావతి మీనాకుమారి.

రచన. సముద్రాల రాఘవాచార్య
సంగీతం. ఘంటసాల • కెమెరా. రహమాన్
దర్శకత్వం సి.ఎస్.రావు

నిర్మాతలు 

జూపిటర్ పిక్చర్స్ మద్రాసు

"ఈస్టిండియా విడుదల"

# తుషార్‌తో వండిన పదార్థాల రుచి ఇంట్లో అందరికీ యిష్టమే




తుషార్ వనస్పతిలో వున్న ఆ ప్రత్యేకమైన రుచివల్ల అది కుటుంబానికంతకూ యిష్టమైన పదార్థమైంది. తుషార్‌తో చేసిన వంటకాలు ఎక్కువ రుచిగా వుండుటమేగాక పుష్టికరంకూడా. ఎందుకంటే తుషార్‌లో ఎ.డి. విటమినులు వున్నాయి. రుచికరమైన భోజనంకోసం తుషార్‌ను వాడండి!

**తుషార్** వనస్పతిలో ఎ. డి విటమినులు కలవు.

తుంగభద్రా ఇండస్ట్రీస్ లిమిటెడ్, కర్నూలు

ASP/TI-11

నెరసిన శిరోజాల
గురించి
చింతించ నక్కర్లేదు

హెయిర్ ఆయిల్‌గా




మీరు వాడితే చాలు




సోల్ ఏజెంట్లు అండ్ ఎగుమతి దార్లు
ఎమ్.ఎమ్. ఖంభట్ వాలా,
అహమదాబాద్ (భారతదేశం)
ఏజెంట్లు :
సి. నరోత్తమ్ అండ్ కో.,
బొంబాయి - 2



# పాఠకుల లేఖలు

## ఫిబ్రవరి 1963

గేయ కథలు చాలా అద్భుతముగా నున్నవి. శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యగారు ఎల్లప్పుడూ ఇలాంటి గేయ కథలు పంపుతూంటారని ప్రార్థిస్తాము.

-యమ్. యస్. రమామణి, విజయనగరం

బాలుడనై ఉండగా, అనగా మూడవ తరగతి నుండి నేడు ఇంజనీరింగు కాలేజిలో చదువు చున్నప్పటికి ఇప్పటివరకు "చందమామ" కొని చదువుచున్నాను. "చందమామ" పై ఉన్న ప్రేమ ఇంకా పెరుగుతుందేగాని తరగటము లేదు.

—ఎస్. ఆర్. కస్తూరి, సూర్యాపేట

"చందమామ" 60 న.పైసలకు హెచ్చించినా కొనడానికి వెనుకాడరు. నేను ప్రతి నెల "చందమామ" కొనకపోతే వుండలేను.

—యం. సోవియట్ షాహు, పూలపల్లి

జనవరి "చందమామ" తాలూకు వ. ప. గారు వేసిన అట్ట చివరి బొమ్మ నన్నెంతయో ఆకర్షించినది. వారికి నా ధన్యవాదములు.

—పి: హరివర్మ, కోరాపుట్

వారము రోజుల నుండి భోజనము లేనివానికి పంచ (భక్ష్య) పరమాన్నములు పెట్టితే ఎంత ఆత్రముగా తినునో, నేనుకూడ "రాకాసిలోయ" సీరియల్ చదివేటప్పుడు అంత తొందరగా చదువుతానంటే నమ్మండి.

—వి. కిషోరుబాబు, మసులా

"చందమామ" 1950 నుండి చదువుతున్నాను. నెలనెల క్రొంగొత్త పోకడలతో ప్రచురిస్తూ, ముద్రణలోనూ, గెటప్‌లోనూ సాటిలేని పత్రికగా వెలుగొందుతున్న "చందమామ"ను మాకు సమర్పిస్తున్నందుకు మీకు నా అభివందనలు.

—"సురేఖ", బాపట్ల

"చిలుక బుద్ధి", "వెర్రిబాగులవాడు", "రాజైన బానిసపిల్ల", "వరప్రదానం", "దేవతలు దిగి వచ్చారు" ఈ కథలు నన్ను ఎంతో ఆకర్షించినవి. ముఖ్యముగా రామాయణం చందమామకు వజ్రం లాటిది. —బి. లక్ష్మిదేవి, ఉయ్యూరు

"దేవతలు దిగి వచ్చారు" కథ నాకు ఎంతో నచ్చింది. ఈ కథ రచించె ఆ మహా పురుషుడెవరో వారికి నా కృతజ్ఞతలు అందజేయగోరుచున్నాను.

-రాఘవభొట్ల శ్రీ కృష్ణమూర్తి, కాకరపర్రు

సీరియల్ కథల్లో బేతాళ కథ మంచి కథ. రెండవది "దేవతలు దిగి వచ్చారు", హాస్య కథల్లో "రాక్షసుడు" మొదటిది. రెండవది "చిలుక బుద్ధి."

—కె. అమృత రాఘవయ్య, రాళ్ళపాక

"వరప్రదానం", "రాక్షసుడు", "వెర్రి బాగులవాడు", "రాజైన బానిసపిల్ల" మొదలగు కథలు బాగున్నవి. "రాకాసిలోయ" సీరియల్ అమోఘంగా ఉన్నది.

—యం. మంజూర్ అహ్మద్, నెల్లూరు

"చందమామ" చదవడము అరగంట అయినా కథలు మాత్రము మనసులో నెలవరకు, అనగా ఇంకొక "చందమామ" వచ్చినంతవరకు, అట్లే చిరస్థాయిగా నుంటున్నవి.

—జి. హనుమంతరాయుడు, కమలాపురం


నోపిన్

కాల్ కెమికో వారి బాధా నివారిణి

కండరముల నెప్పి, సీయాటికా, గుండె జబ్బుల నుండి సత్వర విముక్తి

మార్గ్యూఎన్టమ్

నీమ్‌క్రీమ్

దురదలు, కెంటిమలు, స్ఫోటకపు మచ్చలు, కురుపులు, గాయములు, పుండ్లు, మొ. వాటికి

కాల్ కెమికో వారి వస్తువులు—"మార్కో" నట్టును తయారు చేయువారు.

దక్షిణ ఇండియా ఆఫీసు: 5/149, బ్రాడ్వే, మద్రాసు-1.

# 'ష్యూర్-షాట్'




## ఫొటోగ్రఫీ పేరుకు పర్యాయ పదం

మీరు ఉపయోగించిన తొలిసారే, 'ష్యూర్-షాట్' మీ కోసమే నిర్మింపబడిన కెమేరా అని మీకు అర్థమౌతుంది. మీరు తీసిన అద్భుతమైన ఫొటోగ్రాఫులు చూసి మీరే ఆశ్చర్యపోతారు. ష్యూర్-షాట్‌ను ఉపయోగించడం ఎంతో సులభం.

కేవలం ష్యూర్-షాట్‌లోనే మీకు ఈ ప్రత్యేక లక్షణాలు లభించుతాయి :— అందమైన లేకరైట్ కేసు • 120 ఫిల్మ్ మీద 12 చతురస్రాకారపు చిత్రాలు • డబుల్ ఎక్స్‌పోజరు జరగకుండా యేర్పాటు • టైమ్ ఎక్స్‌పోజరు • ఫ్లాష్ సింక్రొనైజేషన్.

**రూ. 25**
స్థానిక పన్నులు అదనం

పెద్ద ఫొటో వ్యాపారులవద్ద దొరుకుతాయి. లేక

**పటేల్ ఇండియా ప్రైవేట్ లి.,** బొంబాయి • ఢిల్లీ • కలకత్తా • మద్రాసు.

**ష్యూర్-షాట్ శ్రేష్ఠమైనదేగాక, ఖర్చు కూడా స్వల్పం**

PISS-G-4.TEL.

'SISTA'S-SG-173 TEL



# టినోపాల్ మాత్రమే బట్టలను అదనంగా తెలుపు చేస్తుందని తెలివైన తల్లులకు తెలియును!




టినోపాల్ యిచ్చే మెరుగును పెట్టండి
తళతళలాడే తెల్లని యూనిఫార్మ్ తొడుగు
కొన్న మీ పిల్లలను చూడడానికి ఎంతో
ముచ్చటగా ఉంటుంది. తెల్లని దుస్తులకు కళ్లు
మిరుమిట్లు గొలిపే అదనపు తెల్లదనము కలి
గించుటకే టినోపాల్ ప్రత్యేకముగా తయారు
చేయబడినదని తెలివైన తల్లులకు తెలియును.

ఎంతో పొదుపు కూడ
టినోపాల్ మెరుగు పెట్టుకొనుటకు మీకు
ఏమీ ఎక్కువ ఖర్చు కాదు. ఒక బాల్చీడు
బట్టలను తెల్లగా చేయుటకు టీ చెంచాలో
నాలుగోవంతు టినోపాల్ మాత్రమే చాలును;
టినోపాల్ యిచ్చే తెల్లదనము త్వరగా
పోదు; మీరు బట్టలను ఉతుక్కొనే ప్రతిసారి
టినోపాల్‌ను ఉపయోగించ నక్కరలేదు.

జ్ఞాపకముంచుకోండి-




టినోపాల్ జె. ఆర్. గెయిగి, ఎస్. ఎ. బాల్, స్విట్జర్లెండ్ వారి రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్క్.

ఉత్పత్తిదారులు :
సుహృద్ గైగి లిమిటెడ్ వడి వాడి, బరోడా

సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
సుహృద్ గైగి ట్రేడింగ్ లిమిటెడ్ పోస్ట్ బాక్స్ 965, బొంబాయి-1 బి.ఆర్.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

"రాజైన బానిసపిల్ల" కథ పాఠకులకు చాలా ఆనందం చేకూర్చినట్టు అనేక ఉత్తరాలు వచ్చాయి. అటువంటిదే మరొక కథ ఈ సంచికలో ప్రారంభిస్తున్నాము. దాని పేరు "గంధర్వ చక్రవర్తికూతురు".

పురాణ కథల పట్ల కూడా పాఠకులు ఆసక్తి చూపుతున్నారు: "దేవతలు దిగి వచ్చారు" అనేక మంది పాఠకుల ప్రశంసలకు పాత్రమయింది. ఈ సంచికలో "సీమంతిని" కథ ప్రచురిస్తున్నాము.

"రామాయణం" విషయంలో అనేకమంది పాఠకులు రకరకాల అపోహలను ప్రకటిస్తున్నారు. కొందరు సినిమా చిత్రాలను ప్రమాణంగా చెబుతున్నారు. దీనిని ఒక భగవంతుడి కథగా కాక వాల్మీకి రచించిన కథగా చదవమని పాఠకులకు మా సలహా.

సంపుటి : 32 - ఫిబ్రవరి 1963 - సంచిక : 2



CHITRA----



# భారత చరిత్ర



ఘూర్ మహమ్మద్ ఇండియా పై చేసిన మొదటి దాడి 1175లో ముల్తాన్ పై జరిగింది. ఈ దాడి సఫలమయింది. కాని 1178లో అతను గుజరాత్ పై దాడి చేసి చిత్తుగా ఓడిపోయాడు. అయినప్పటికీ మరుసటి ఏడే అతను పెషావరును లోబరుచుకున్నాడు. 1181లో శియాల్కోటలో ఒక దుర్గం నిర్మించాడు.

ఆ కాలంలో ఘజ్నీ వంశస్థుడైన ఖుస్రవ్ మాలిక్ లాహోరులో పాలిస్తున్నాడు. ఘూర్ మహమ్మద్ జమ్మూ రాజైన విజయదేవుడితో సఖ్యం చేసుకుని, ఖుస్రవ్ మాలిక్‌ను బందీగా పట్టుకుని ఘజ్నీకి తెచ్చాడు. ఈ సంఘటనతో పంజాబులో ఘజ్నీ వంశీయుల పరిపాలన ముగిసింది. పంజాబు ఘూర్ మహమ్మద్‌కు చేజిక్కటంతో ఇండియాలో ఇతర ప్రాంతాలను లోబరుచుకునే అవకాశం ఏర్పడింది.

ఈ ప్రయత్నంలో అతను రాజపుత్రులతో—ముఖ్యంగా పృథ్వీరాజ్ చౌహాన్‌తో—తలపడవలసి వచ్చింది. పృథ్వీరాజు కింద ఢిల్లీ, అజ్మీరు నగరాలున్నాయి. కన్యాకుబ్జాన్ని జయచంద్రుడనే గాహడవాల వంశంవాడు ఏలుతున్నాడు. జయచంద్రుడు సాధారణంగా కాశీలోనే ఉంటూండేవాడు. భారతదేశంలో ఆనాటి రాజులందరికీ జయచంద్రుడు మిన్న అని ఆ కాలపు మహమ్మదీయ చరిత్రకారులు రాశారు.

జయచంద్రుడూ, పృథ్వీరాజూ ఏకమై ఉంటే ముస్లిమ్ శత్రువు సంగతి ఏమయేదో, కాని వారి మధ్య సఖ్యత లేదు. జయచంద్రుడు పృథ్వీరాజు ఔన్నత్యాన్ని ఓర్చలేకపోయాడు. పృథ్వీరాజును పిలవకుండానే జయచంద్రుడు తన కుమార్తెకు స్వయంవరం ఏర్పాటు చేశాడనీ, మీదు మిక్కిలి పృథ్వీరాజును అవమానించటానికి అతని

## 17. ఇండియాపై ముస్లిముల ఆధిపత్యం

ప్రతిమను ద్వారం వద్ద ద్వారపాలకుడి స్థానంలో ఉంచాడనీ, జయచంద్రుడి కుమార్తె అయిన సంయుక్త ఆ ప్రతిమ మెడలో పూలమాల వేసిందనీ, పృథ్వీరాజు ఆమెను తీసుకుపోయి పెళ్ళాడాడనీ కథ చెబుతారు. ఈ కథను ఎంతోమంది బుర్ర కథలుగానూ, గేయాలుగానూ పాడేవారు.

1190 అంతంలో ఘూర్ మహమ్మద్ సైన్యాలతో సహా ఇండియా పైకి వస్తున్నాడని తెలియగానే పృథ్వీరాజు 2 లక్షల అశ్విక బలంతోనూ, మూడువేల ఏనుగులతోనూ, పరాక్రమంలో ముస్లిములకు ఏమాత్రమూ తీసిపోని రాజపుత్ర వీరులతోనూ ఎదురు వెళ్ళాడు. స్థానేశ్వరం సమీపంలో తరాయిన్ అనే చోట ముస్లిము సేనలకూ, రాజపుత్ర సేనలకూ 1191 లో యుద్ధం జరిగింది. హిందూ సేనలు ఘూర్ మహమ్మద్ సేనలను బాగా చీకాకు పరచి, చివరకు ఓడించాయి. ఘూర్ మహమ్మద్ యుద్ధంలో గాయపడి ఘజ్నీకి వెళ్ళిపోయాడు.

కాని ఆ మరుసటి ఏడు అతను మరింత గొప్ప సేనను సమకూర్చుకుని అదే చోట పృథ్వీరాజు సేనలతో యుద్ధం చేశాడు. ఈసారి విజయం ముస్లిములది. పృథ్వీరాజు శత్రువులకు చిక్కి హత్య చేయబడ్డాడు.



1192 లో ముస్లిములు సాధించిన ఈ విజయంతో పైకి వచ్చినవాడు కుతుబుద్దీన్ ఐబక్ అనేవాడు. భారత చరిత్రలో ప్రముఖ స్థానం వహించే ఈ కుతుబుద్దీన్ తుర్కిస్తానుకు చెందిన ఒక బానిస. ఇతను కుర్రవాడుగా ఉన్నప్పుడే ఒక వర్తకుడు ఇతన్ని నిషాపూర్‌కు తీసుకు వచ్చి ఒక కాజీకి అమ్మాడు. కుతుబుద్దీన్ కాజీ కొడుకులతో బాటు మతబోధా, సైనిక శిక్షణా పొందాడు. కాజీ చనిపోయాక ఆయన కొడుకులు తమ బానిసను ఒక వర్తకుడికి అమ్మగా, ఆ వర్తకుడు అతన్ని ఘజ్నీకి తెచ్చి ఘూర్ మహమ్మద్‌కు అమ్మాడు.

కుతుబుద్దీన్ చూడటానికి అనాకారి అయినా అనేక మంచి గుణాలూ, శ్లాఘనీయ లక్షణాలూ గలవాడు. ఘూర్ మహమ్మద్‌కు అతని మీద ఎంతో నమ్మకం. అందుచేత ఆయన అతన్ని తన అశ్వశాల లన్నిటిపైనా అధిపతిని చేశాడు. యుద్ధాలలో కూడా కుతుబుద్దీన్ తన యజమానికి ఎంతో అండగా ఉండటంచేత 1192 తరవాత భారతదేశాన్ని జయించే భారాన్ని ఘూర్ మహమ్మద్ కుతుబుద్దీన్ పైన పెట్టాడు. తనను యజమాని నమ్మినందుకు కుతుబుద్దీన్ ఆ యేడే హాంసీ, మీరట్, ఢిల్లీ మొదలైన అనేక ప్రాంతాలను జయించాడు. 1194లో కాశీ—కన్యాకుబ్జ రాజైన జయచంద్రుడు ఘూర్ మహమ్మద్‌కు ఓడి నిహతు డైనప్పుడు కుతుబుద్దీన్ సహాయం కూడా ఉండింది. 1197లో ఇతను గుజరాతు రాజధానిని కొల్లకొట్టాడు. 1202లో కాలింజర్ (బుందేల్ ఖండ్) కోటను పట్టుకుని 50 వేల మంది స్త్రీ పురుషులను ఖైదీలుగా తీసుకున్నాడు.

ఘూర్ మహమ్మద్‌కు కుతుబుద్దీన్ కుడి భుజమైతే, ఇఖ్తియారుద్దీన్ మహమ్మద్ అనే వాడు ఎడమ భుజం. ఇతను బీహారూ, పశ్చిమ బెంగాలులో కొంత భాగమూ, అనేక ఇతర ప్రాంతాలూ గెలిచి ముస్లిమ్ సామ్రాజ్యంలో కలిపాడు.

తన అన్న చనిపోయినాక, 1203 ఫిబ్రవరిలో ఘూర్ మహమ్మద్ ఘజ్నీ, ఘూర్, ఢిల్లీలకు ప్రభువయాడు. 1205లో ఇతను మధ్య ఆసియాలో యుద్ధం చేసి పెద్ద అపఖ్యాతికి గురి అయాడు. భారతదేశంలోని ఇతని సామ్రాజ్యంలో అరాజక లక్షణాలు కలిగాయి. అతను తిరిగి వచ్చి ఈ అరాజకాన్ని అణచ గలిగాడు కాని త్వరలోనే, అతను లాహోరు నుంచి ఘజ్నీ వెళుతుండగా 1206 మార్చి 15న కొందరు హంతకులు చంపేశారు.






# దాస్యవిముక్తి

ద్వితీయాశ్వాసము :

తనదు రెండవ అండ మందలి
తనయు నెత్తగ వినత మురియుచు,
పెక్కు నోములు నోచుకొన్నది,
మ్రొక్కుకొన్నది ఎన్ని మ్రొక్కులు.

"విష్ణుదేవా! నా కుమారుని
వేయి పడగల శేషునంతటి
వాని జేసిన, నీకు వానిని
వాహనంబుగ ఒసగుదానను."

ఈ రీతిగ వినత భగవ
దారాధన చేయుచుండ,
అంత కొంతకాలమునకు
ఆ రెండవ యండ మవిసె.

అందునుండి మహాద్భుతంబుగ
అరుణకాంతుల తేజరిల్లుచు,
వెడద తెక్కల విప్పియాడుచు,
వెడలి వచ్చెను వైనతేయుడు.

వజ్ర సమమగు వాని తుండము
వంగి యుండెను భీకరంబుగ;
అతని కన్నులు అగ్నిగోళము
లట్లు ధగ ధగ మండుచుండెను!

తన కుమారుని ధృఢ శరీరుని
వినత కన్గొని పొంగిపోయెను;
ముదముతో మెడ కౌగిలించుచు
ముద్దులాడెను వైనతేయుని.

వినత కొడుకును చూడ కద్రువ
తన కుమారులతోడ వచ్చెను;
అచట గరుడుని చూచినంతట
ఆమె కప్పుడె కన్ను కుట్టెను.

ఈసుతో అరుదెంచి కద్రువ
ఎల్ల కొడుకుల పిలిచి, ఊరక
కోప పడి చీవాట్లు పెట్టెను,
కొందఱిని కసితోడ మొట్టెను.

ఉత్పల సత్యనారాయణాచార్య



"జననీ! ఈ యింట నేను
క్షణమైనను ఉండలేను!
అడవులందు తపము చేయ
నరుగుచుంటి, సెల వొసగుము."

అని శేషుడు పలికి సంత
అగ్గి మీద గుగ్గిలమయి,
భగ్గున నంతెత్తు మండి
పలికె నిట్టులా కద్రువ.

"ఆ వినతా సుతుల చూచి
స్త్రైన సిగ్గు తెచ్చుకొనుడు;
అవిటియైన వాడు కూడ
అరుణుని సారథి యయ్యెను.

వెడలి పొండు—ఛీఛీ నా
కడుపున చెడ బుట్టినారు,
ఏమి చేయగలరు మీరు?
భూమికి బరువైన వారు."

అని కసరిన శేషుడపుడు
"అమ్మా! నను పంపించుము,
తగు ప్రయోజకులు నీ సుతు
లగునట్లుగ దీవించుము!

తల్లీ! ఈ శేషు డింక
ధరణికి బరువై పోవడు;
ధరణీ భారము నీదగు
దయతోడను మోయుగలడు."

అని కన్నులు చెమ్మగిల్ల
వినయముతో నా శేషుడు
తల్లికి ప్రణమిల్లినాడు,
ఇల్లు వదలి పోయినాడు.

అటు పిమ్మట ఒక్కనాటి
అపరాహ్ణపు వేళయందు
వినతా కద్రువ లిద్దఱు
విహరింపగ వెళ్ళినారు—

అది సముద్రతీర భూమి
అల లొడ్డుకు మెల్ల వచ్చి,
పూ దీగెల కనులు మూసి
పోవుచుండె వెనువెన్కకు!

"చూడవె! ఆ దృశ్య మెంత
సొగసైనదొ, అక్కా!" యని
వినతా సతి కద్రువ కది
వేడ్కతోడ చూపించెను.

"అది సరిలే! చూడు చూడు
అటు ప్రక్కన గల గుఱ్ఱము
ఎంత తెల్లగా నున్నదొ!
ఎంత చక్కగా నున్నదొ!!"

"అవు నవునే, అక్కా! అది
అతి నిర్మలమై యున్నది!
దరికి కొట్టుకొని వచ్చిన
నురుగు తెట్ట లా గున్నది!

ఎవ్వరిదో ఈ గుఱ్ఱము
ఇంద్రుని ఉచ్చైశ్శ్రవ మొకొ!
మహా పురుషు కీర్తి వోలె
మచ్చ యొకటి లేకున్నది!"

వినత యిట్లు మెచ్చుకొనగ
విని కద్రువ పెదవి విఱిచి,
"చాలించవె నీ వర్ణన!
ఏల మచ్చ లే దందువు?

అదిగొ! చూడు దాని తోక
అచ్చముగా నలుపున్నది;
చంద్రునిలో మచ్చవోలె
చక్కగ కనబడుచున్నది!"



అనిన నవ్వి వినతా సతి,
"అక్కా! నీ వే కన్నుల
చూచినావొ? నలుపెక్కడ
తోచదు కదె నా కంటికి!"

అనిన దీనికి పందె మాడుము
అనుచు కద్రువ పట్టు పట్టెను,
"పందె మెందుకు ఇట్టి దానికి;
పదవె హయమును చూచి వత్తము."

అనిన కద్రువ కాదు కాదని
వినతతో పందెంబు వైచెను—
"నీవు గెల్చిన నేను దాసిని;
నేను గెల్చిన నీవు దాసివి."

అనిన వినతయు తెంపు చేసెను,
అత్తఱంగున కియ్యకొనియెను;
వార లిద్దఱు దైవ సాక్షిగ
వైచి కొని రచ్చోట పందెము.

అపుడు నల్లని నీటి మబ్బులు
ఆ సముద్రము నుండి వెడలెను;
వినత మొగమును మబ్బు నీడలు
విడిసి కళవళ పెట్ట దొడగెను!

"అక్క, రావే చూచి వత్తము
అశ్వరాజము నిప్పుడే"యని
వినత పలికెడు నపుడె చిటపట
మనుచు చినుకులు పడ దొడంగెను.

"వాన వచ్చుచు నున్న దిప్పుడు
వలదు, రేపటి రోజు చూతము
వేగముగ ర"మ్మనుచు వినతను
వెంట నిడుకొని పోయె కద్రువ.

వినత వెనుకకు తిరిగి చూచుచు
విన్నదనమున పోయె నింటికి—
ఱెక్క లార్చుచు వెల్ల గుఱ్ఱము
ఱింగు మని పైకెగసి పోయెను. (సశేషం)






## 20

[కేశవుడూ, జయమల్లూ, కోయయువకుణ్ణి రక్షించారు. తరవాత వాళ్ళు చండమండూకుడు పారిపోయిన రహస్య సొరంగ మార్గం తెలుసుకున్నారు. ఈ లోపల మండూకుడు, ఒక అనుచరుడితో సొరంగ మార్గం నుంచి, అడవి మధ్య వున్న ఒక పాడుపడ్డ బావి కుండా పైకి వచ్చి, బ్రహ్మదండి మాంత్రికుణ్ణి తిట్టసాగాడు. తరవాత—]

చండమండూకుడి అనుచరుడికి, తమ నాయకుడు బ్రహ్మదండిని తిట్టటం గాని, అతణ్ణి అనుమానించటం గాని, ఏ మాత్రం సబబుగా కనిపించలేదు. జోలెడు ధనం యిచ్చి, బ్రహ్మపుర రాజు చేత అర్ధ రాజ్యం యిప్పించగలనని వాగ్దానం చేసిన బ్రహ్మదండి, మండూకుణ్ణి చంపేందుకు మనుషుల్నెందుకు పంపుతాడు? పైగా, ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ లేందే రాకాసిలోయలో తను సాధించగలిగిందేమీ లేదని, బ్రహ్మదండి ముందుగానే మండూకుడికి చెప్పి, వాళ్ళను పట్టుకునే పని అతడికి ఒప్పగించాడు. ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ ఈ లంకకు చేరటంలో ఏదో రహస్యం వున్నది...

చండమండూకుడి అనుచరుడు యిలా ఆలోచిస్తూ, తమ నాయకుడి ముందుకు వచ్చి, "మండూకేశ్వరా, తొందరపడకండి. ఆ దుర్మార్గు లిద్దర్నీ పంపినవాడు బ్రహ్మదండి కాడని నా అనుమానం. మన సహాయం కోరిన ఆ మాంత్రికుడు మనను



మాట్లాడు కుంటున్న బ్రహ్మదండి మాంత్రికుడూ, అతడి అంగరక్షకులైన, జితవర్మా, శక్తివర్మలూ చూశారు. నరభక్షకుడి వాలకం వాళ్ళ ముగ్గురిలో భయాశ్చర్యాలను కలిగించింది.

బ్రహ్మదండి, జిత శక్తివర్మల కేసి తల తిప్పి, "జితా, శక్తీ, చూశారా మన కేసి వస్తున్న, మండూకుడి అనుచరుడి ముఖ లక్షణాలు. వాడేదో మాంచి కోపంలో వున్నట్టున్నాడు. మనకేం ప్రమాదం లేదు గదా!" అన్నాడు నిస్పృహగా.

"అసలు ఈ నరభక్షకులతో స్నేహం కలపటమే ప్రమాదం. నే వొద్దని ఎంత మొత్తుకున్నా, విన్నావు కాదు," అన్నాడు జితవర్మ కోపంగా.

"మనం స్నేహితులమని చెప్పి, డబ్బూ, రాజ్యం వస్తుందన్న ఆశ చూపకపోతే, మనను మండూకుడు ఎప్పుడో కాల్చుకు తినేసేవాడు. ఒకసారి వాళ్ళకు చిక్కిం తరవాత, మనం చేయ గలిగిందేముంది; నిస్సహాయులం. అంతా ఆ కాలభైరవుడి అధీనం," అన్నాడు బ్రహ్మదండి.

సంభాషణ ఇలా జరుగుతున్నంతలో, మండూకుడి అనుచరుడు అక్కడికి రానే వచ్చాడు. వస్తూనే వాడు, బ్రహ్మదండి కేసి

చంపించే ప్రయత్నం ఎందుకు చేస్తాడు? ఇందువల్ల అతడికి కలిగే లాభం ఏమిటి? ఆలోచించాలి," అన్నాడు.

"ఆలోచించు...తీరిగ్గా ఆలోచించు!" అంటూ మండూకుడు గట్టిగా కసురుకుని, "ముందు నువ్వెళ్ళి, ఆ బ్రహ్మదండి భడవాని యిక్కడికి తీసుకు రా. పావు గంటలో రావాలి, తెలిసిందా? అలా చేయక పోయావే, నీ చర్మం వొలిపిస్తాను," అంటూ కళ్ళెర్ర చేశాడు.

మండూకుడి అనుచరుడు పెద్ద పెద్ద అంగలేస్తూ హడావిడిగా రావటం, కొండ అంచున వున్న గుడారాల ముందు కూచుని



కోపంగా చూస్తూ, "బ్రహ్మదండీ, నీ రోజులు మురిసినై. మా నాయకుడు నిన్ను నిలువునా కాల్చుకు తింటానంటూ కారాలూ మిరియాలూ నూరుతున్నాడు," అన్నాడు.

"నన్నా? కాల్చుకు తినటమా? ఆశ్చర్యం! ఆ మండూకేశ్వరుడికి నేను చేసిన ద్రోహం ఏమిటి? బ్రహ్మపుర రాజ్యంలో అర్ధ రాజ్యం యిప్పిస్తానని కూడా మాట యిచ్చానే," అంటూ బ్రహ్మదండి లేని బింకం నటించాడు.

"అర్ధరాజ్యం మాట భద్రమండూకుడెరుగు! నువ్వు, మా నాయకుణ్ణి చంపించేందుకు, ఆ జ్యేష్ఠుణ్ణీ, కనిష్ఠుణ్ణీ ఆయన భవంతి దగ్గిరకు పంపావు, అవునా?" అని ప్రశ్నించాడు మండూకుడి అనుచరుడు.

జ్యేష్ఠుడు, కనిష్ఠుడు అన్న పేర్లు వింటూనే బ్రహ్మదండి మాంత్రికుడు, కూచున్న చోటు నుంచి ఎగిరి లేచి, "హాఁ, కాలభైరవా, ఎన్నాళ్ళకు నీ భీకరదృష్టి నా మీదికి ప్రసరించింది! జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ దొరికారా?" అంటూ జితశక్తివర్మల కేసి తిరిగి, "మీకూ తెలును గదా, వాళ్ళు జయమల్లూ, కేశవుడని? ఇక లేవండి, బయలుదేరండి. మన ప్రయాణం సూటిగా రాకాసిలోయకే," అంటూ చిందులు తొక్కసాగాడు.

మండూకుడి అనుచరుడు ముందుకు వచ్చి, బ్రహ్మదండి భుజం పట్టుకుని ఒక్క తోపుతోస్తూ, "కపటనాటకం ఆడకు! ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ దొరికారని నీ కెవరు చెప్పారు? ఆ దుర్మార్గుల నుంచి తప్పుకుని ప్రాణాలతో బయటపడటంలో, నాకూ, మండూకేశ్వరుడికీ తల ప్రాణం తోకకు వచ్చింది," అన్నాడు.

"అయితే వాళ్ళిప్పు డెక్కడున్నారు? ఇంకా మండూకేశ్వరుడి భవనంలోనే వున్నారా? క్షణాలమీద వాళ్ళను పట్టేస్తాను. జితా, శక్తీ, లేవండి," అంటూ బ్రహ్మదండి కేకలు ప్రారంభించాడు.



బ్రహ్మదండి మాంత్రికుడే అదుర్దా, అతడి మాటల తీరూ చూసిం తరవాత, మండూకుడి అనుచరుడికి, అతడు నిర్దోషి అన్న నమ్మకం కలిగింది. జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ బ్రహ్మదండి పంపగా వచ్చిన వాళ్ళని, తమ నాయకుడు అనుకోవటం పొరపాటని, అతడికి మొదటి నుంచీ తెలుసు. ఇప్పుడు తను వేసిన పేచీతో నిజం తెలిసిపోయింది. కాని, మండూకుడి కోపాన్ని శమింపచేయుటం ఎలా?

మండూకుడి అనుచరుడు ఓ క్షణకాలం ఆలోచిస్తూ వూరుకుని, తరవాత బ్రహ్మదండిని దూరంగా తీసుకుపోయి, జిత శక్తి



వర్మలకు వినబడని విధంగా స్వరం తగ్గించి, "మా నాయకుడు నువ్వంటే మండిపోతున్నాడు," అంటూ జరిగిందంతా చెప్పి, "ఒకవేళ నువ్వు నిర్దోషివని ఎంత చెప్పినా, మా నాయకుడు నమ్మకపోతే, ఏదో మంత్రం వల్లించినట్టు నటించి, జ్యేష్ఠుణ్ణీ, కనిష్ఠుణ్ణీ ఆయన భవంతి దగ్గిరకు పంపిన వాడు జితవర్మ, శక్తివర్మ అని చెప్పెయ్యి. ఆ యిద్దర్లో ఒకడి పీడ విరగడ అవుతుంది. నువ్వు రానున్న ప్రమాదాన్నుంచి బతికి బయటపడతావు," అన్నాడు.

ఆ మాటలతో బ్రహ్మదండికి ప్రాణం కుదుటపడింది. అతడు మెల్లిగా తల తిప్పి జిత శక్తివర్మల కేసి చూసి, "మండూకానుచరాగ్రణీ! మీరు చెప్పింది మహ బావుంది. ఒక్క గొప్పవాడి ప్రాణ రక్షణకుగాను, వెయ్యిమంది అల్పులను బలి చెయ్యవచ్చని శాస్త్రగ్రంథాలన్నీ మూకవుమ్మడిగా మొర పెడుతున్నవి. ఇక బయలుదేరండి. ఆ మండూకేంద్రుల వారి సన్నిధానానికి వెళ్ళి వారి దివ్య దర్శనభాగ్యం కలిగించుకుందాం," అన్నాడు.

మండూకుడి అనుచరుడూ, బ్రహ్మదండీ ముందు నడవసాగారు. వెనకగా వస్తున్న జిత, శక్తివర్మలకు, వాళ్ళిద్దరూ రహస్యంగా

మాట్లాడుకున్న దేమిటో తెలియక పోవ టంతో భయం పట్టుకున్నది. కాని, పారి పోయే ప్రయత్నం చెయ్యటం వృథా. లంకలో తమ కొక్క స్నేహితుడు లేడు, అంతా నరభక్షకుల మయం!



నలుగురూ చండమండూకుడున్న పాడు పడ్డ బావి ప్రాంతాల కొచ్చేసరికి అక్కడ మండూకుడు యిద్దరు నరభక్షకులకు ఏవో సంజ్ఞలు చేస్తూ, మధ్యమధ్య బావిలోకి తొంగి చూస్తున్నాడు. అది గమనించిన, అతడి అనుచరుడూ, బ్రహ్మదండీ నిశ్శబ్దంగా మండూకుణ్ణి సమీపించారు. మండూకుడు వాళ్ళను బావి దగ్గర నుంచి, కొంచెం ఎడంలోవున్న చెట్ల కిందకు తీసుకుపోయి ప్రాణభయంతో వణుకుతున్న బ్రహ్మదండితో, "బ్రహ్మదండీ, భయపడకు! నువ్వేదో ద్రోహం చేశావని యింతకు ముందు అనుమానించాను. కాని, అడవి నుంచి తిరిగివచ్చిన నా అనుచరుల ద్వారా, ఆ జ్యేష్ఠుడూ, కనిష్ఠుడూ ఈ లంక కెలా చేరారో తెలుసుకున్నాను. వాళ్ళు బానిసల గుంపు నుంచి విడివడి నదిలోకి దూకి, ఈ లంక చేరారట. సరే, ప్రస్తుత ముఖ్య విషయం అది కాదు. వాళ్ళిద్దరూ మన కిప్పుడు బోనులో చిక్కిన సింహాలు," అంటూ బావి కేసి చేయి చూపి, "వాళ్ళిప్పుడు నా భవనం నుంచి యిక్కడికి వున్న సొరంగ మార్గం గుండా వస్తున్నారు. ఆ చివర మనవాళ్ళను కాపలా పెట్టాను. కొందరు సొరంగ మార్గంలోకి దిగి వాళ్ళనిటు తరుముకు వస్తున్నారు. మనం యిక్కడ మాటువేసి, బావిలోనుంచి వాళ్ళు బయిటికి రాగానే సజీవులుగా పట్టుకోవాలి. తెలిసిందా?" అన్నాడు.

మండూకు డిలా చెప్పగానే, బ్రహ్మదండి మాంత్రికుడికి కలిగిన ఆనందం అంతా యింతా కాదు. అతడి కళ్ళ ముందు రాకాసిలోయ లోని ధనరాసులన్నీ



గిర్రున తిరిగినై. అతడు జిత, శక్తివర్మల దగ్గిరకు వెళ్ళి రహస్యంగా, "మండూకుడు చెప్పింది విన్నారు కదా? ఆ కేశవుణ్ణీ, జయమల్లునూ ప్రాణాలతో పట్టుకోండి. బహుశా వాళ్ళ దగ్గిర ఆయుధాలు వుండి వుంటవి. తప్పని సరైతే ఆత్మరక్షణకు జయమల్లును చంపండి కాని, కేశవుడికి మాత్రం ఎలాంటి హానీ కలిగించకండి. తెలిసిందా?" అన్నాడు.

ఆ తరవాత అందరూ కలిసి బావి దగ్గిరకు వెళ్ళి దాని అంచున పొంచి కూచున్నారు. మండూకుడు మధ్యమధ్య కూచున్నచోటు నుంచి లేచి, బావిలోకి తొంగిచూసి, దాని గట్టు మీద చెవి అనించి విని, "శబ్దమవుతున్నది. వాళ్ళిటే వస్తున్నారు," అని మెల్లిగా తన పక్కనున్న వాళ్ళతో చెప్పసాగాడు.

చండమండూకుడు అనుకున్నట్టు, కేశవుడూ, జయమల్లూ, కోయయువకుడూ సొరంగ మార్గం కుండా అటుకేసే వస్తున్నారు. వాళ్ళు గుడిశెలో వున్న సొరంగాన్ని కనుక్కున్న తరవాత, మండూకుడి కోసం అక్కడున్న గదులూ అవీ వెతికి, అతడు లేడని గ్రహించి, తిరిగి గుడిశెలోకి పోదామనుకునేంతలో, అక్కడ అలికిడీ, సొరంగ ద్వారాన్ని కప్పివున్న తలుపు తెరవటం వాళ్ళకు కనిపించింది. వెంటనే వాళ్ళు ప్రమాదాన్ని గ్రహించి, కాగడాల వెలుగులో సొరంగం వెంట దాని రెండవ చివరి కేసి బయలుదేరారు.

"మనం ఇందులో వున్న సంగతి మండూకుడి అనుచరులకు తెలిసిపోయింది. వాళ్ళు మన కోసమే వస్తున్నారు," అన్నాడు కోయయువకుడు.

కేశవుడు అవునన్నట్టు తల వూపాడు. జయమల్లు వెలుగుతున్న కాగడాతో సొరంగ మార్గాన ముందుకు నడుస్తూ, "మనకు దీని వెంట పడి, ఇది ఎక్కడికి చేరిస్తే,

అక్కడికి చేరటం ఒక్కటే వున్న దారి. మండూకుడు ఆ చివర కూడా కాపు పెట్టక పోతే, మనం బతికి బయటపడగలం. అలా కాకపోతే, ప్రాణం వున్నంతవరకూ పోరాడదాం," అన్నాడు.

"అంతకాక చేసేందుకు మరేముంది? నరభక్షకులకు ఆహారం అయే ముందు వాళ్ళల్లో కొందరినైనా, మన కత్తులకు ఆహారం చేద్దాం," అన్నాడు కేశవుడు. కోయ యువకుడు అవునన్నట్టు తలాడించాడు.

ఆ విధంగా వాళ్ళు సొరంగమార్గం కుండా నడిచి పాడుబడిన బావిని సమీపిస్తున్నంతలో, పై నుంచి అలికిడి వినబడింది. వెంటనే ముందు నడుస్తున్న జయమల్లు ఆగి, కేశవుడితో మెల్లిగా, "మనం భయపడ్డంతా అయింది. వాళ్ళు మన కోసం కాపలా వేశారు," అన్నాడు.

కేశవుడు ఏదో అనబోయేంతలో వెనక నుంచి వేగంగా సమీపిస్తున్న అడుగుల చప్పుడూ, గుడ్డి వెలుగూ కనిపించింది. వెంటనే ముగ్గురూ తమ తమ ఆయుధాలు గుప్పెళ్ళలో గట్టిగా బిగించి పట్టుకున్నారు. కేశవుడు, జయమల్లును తోసుకుని ముందుకు వస్తూ, "వెన్నంటి వస్తున్న శత్రువులు మన మీద పడకముందే, మనం ముందుకు వెళ్ళి ఆ పైన కాపలావున్న



వాళ్ళ పని పట్టాలి. ఆ విధంగా మనకు ప్రాణాలతో బయటపడే అవకాశం చిక్క వచ్చు," అన్నాడు.

ఆ వెంటనే ముగ్గురూ వేగంగా ముందుకు పరిగెత్తసాగారు.

"హేయ్, ఆ దుర్మార్గులు వచ్చేస్తు న్నారు, ప్రాణాలతో పట్టుకోండి," అంటూ చండమండూకుడు కేక పెట్టాడు. వాడి అనుచరులూ, జిత, శక్తివర్మలూ ఆయు ధాలు చేతబట్టి లేచి నిలబడ్డారు.

"కేశవుడి కేమీ ప్రమాదం కలగ కూడదు. వాడు వెంటలేందే మనం రాకాసి లోయలో ఏమీ చేయలేం. జితా, శక్తీ, జాగ్రత! వాడి కేమైనా ప్రమాదం జరిగిందో మిమ్మల్ని నిలువునా, భస్మం చేసేస్తాను. తరవాత విచారించి లాభంలేదు," అంటూ బ్రహ్మదండి కేకపెట్టాడు.

బ్రహ్మదండి మాంత్రికుడి కేకకు జవాబా అన్నట్టు, కేశవుడూ, జయమల్లూ, కోయ యువకుడూ ఒక్క ఊపులో బావి నుంచి పైకెగిరివస్తూ, సింహాల్లా గర్జించారు. అదే సమయంలో దాపులవున్న గుబురుచెట్ల లోంచి, "గురుమౌనానందులకూ, జై!" అన్న కేకలు వినిపించినై. మరుక్షణంలో, ఒక పెద్దగొంతు, "విప్పచెట్ల మీద వున్న ఇరవైమంది యోధులూ, ముందు దిగి; ఆ బ్రహ్మదండినీ, మండూకుణ్ణీ పట్టు కోండి! నేరేడుచెట్ల చాటున వున్న నలభై యిద్దరూ, బావిలోకి దూకి; సొరంగ మార్గాన వస్తున్న నరభక్షకుల్ని నరకండి!" అంటూ భీకరంగా హెచ్చరించింది.

ఆ హెచ్చరిక వింటూనే "భద్ర మండూకా!" అంటూ మండూకుడూ, "ఉపాసకుల ఊడలమఱ్ఱీ, కాలభైరవా!" అంటూ బ్రహ్మదండి మాంత్రికుడూ బావి దగ్గిర నుంచి ఎగిరి గంతేసి, అడవిలోకి పారిపోయేందుకు పరిగెత్తసాగారు.

—(ఇంకా వుంది)





# తప్పిన వాగ్దానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ వెవరికైనా వాగ్దానం చేసి, అది నిలబెట్టుకోవటానికి ఇలా శ్రమపడుతున్నావేమో. అలా అయితే నిన్ను తప్పు పట్టను. ఎందుచేతనంటే, ఆడిన మాట తప్పి పూర్వం అభిజితు డనే వాడు నాశనమయాడు. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు అతడి కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

ఒకప్పుడు సాళ్వదేశంలో గొప్ప యోధుడైన క్షత్రియ కుమారుడుండేవాడు. అతని పేరు అభిజితు. అతను చెప్పుకోదగినంత సంపన్నుడు కాడు. అతని కింద ఒక చిన్న గ్రామం ఉండేది. ఆ గ్రామాన్ని అనుకునే అతని కొక పాత కోట ఉండేది. అభిజితుకు కీర్తికాంక్ష ఉన్నంతగా ధనకాంక్ష లేదు.

## బేతాళ కథలు



అందుచేత అతను ఏ రాజు దగ్గిరా కొలువు చెయ్యక తన పాత కోటలోనే కాలం గడుపుతూ వచ్చాడు.

అభిజిత్తు నివసించే గ్రామానికి సమీపంలోనే కొండలూ, అడవులూ ఉండేవి. అసక్తి కలిగినప్పుడల్లా అతను తన గుర్రం ఎక్కి అడవుల్లోకీ, కొండల్లోకీ వేటకు పోతూండేవాడు. ఈ వేట వల్ల అతనికి విలువిద్యాభ్యాసం కూడా అవుతూ ఉండేది.

ఒకనా డిలాగే అభిజిత్తు వేటకు బయలుదేరి సూర్యుడు నడినెత్తికి వచ్చినదాకా అరణ్యమంతా కలయ దిరిగాడు. అతనికి దప్పిక అయింది. ఎక్కడన్నా నీరు దొరుకుతుందేమో ననుకుని అతను కొండల మధ్యగా తిరుగుతూండగా ఒక చిన్న సెలయేరు తగిలింది.

వెంటనే అభిజిత్తు గుర్రం దిగి సెలయేటి దగ్గిరికి వచ్చి దాహం తీర్చుకున్నాడు. దప్పిక చల్లారగానే అతను తల ఎత్తి చూసేసరికి అతని కెదురుగా ఒక బండరాయిపైన ఒక అద్భుత లావణ్యవతి కూచుని తన జుట్టు జడ వేసుకుంటూ కనిపించింది.

తాను నీరు తాగటానికి వచ్చినప్పుడు లేని మనిషి ఇంతలో ఎలా వచ్చింది, ఎక్కడి నుంచి వచ్చిందని ఆశ్చర్యపోతూ అభిజిత్తు ఆమెను, "నీవు మనుష్య స్త్రీవా? దేవతవా?" అని అడిగాడు.

ఆమె అతన్ని చూసి నవ్వి, "నేను జలకన్యను. నా పేరు చంద్రముఖి," అన్నది.

ఆమె మానవ స్త్రీ కాదని తెలిసినాక అభిజిత్తు తన దారిన తాను పోదామనుకున్నాడు గాని, చంద్రముఖి సౌందర్యం అతన్ని బలంగా ఆకర్షించటం చేత అతను తన కళ్ళను ఆమె నుంచి పక్కకు తిప్పలేకపోయాడు.

అభిజిత్తు కూడా చాలా చక్కనివాడు కావటం చేత చంద్రముఖి అతన్నే చూస్తూ ఉండిపోయింది. ఆమెకు తన పట్ల స్నేహ

భావం ఉన్నట్టు తెలుసుకుని అభిజితు వెళ్ళిపోయే ప్రయత్నం మాని, ఆమెకు సమీపంగా ఆ కొండరాయి మీదనే కూచుని ఆమెతో కబుర్లు ప్రారంభించాడు.

ఇద్దరూ కులాసాగా మాట్లాడుకోవటంలో కాలం ఎలా గడిచిందీ అభిజితుకు తెలియ లేదు. సూర్యాస్తమానమై చీకట్లు ఆరంభ మవుతుండగా అతను చంద్రముఖితో, "నే నిక ఇంటికి తిరిగి వెళ్ళాలి. కాని నా మనసులో మాట చెప్పేస్తాను : నిన్ను విడిచిపోయాక నాకు నిన్ను గురించిన ఆలో చన తప్ప మరొకటి ఉండబోదు. నిన్నే తలుచుకుంటూ నిద్రాహారాలు కూడా మానెయ్యవలిసి వస్తుంది. అందుచేత నీవు నా వెంట వచ్చి, నన్ను పెళ్ళాడి, నాకు భార్య వవుతావా ?" అని అడిగాడు.

దానికి చంద్రముఖి, "నీవు నన్ను చూడక మునుపే నేను నిన్ను చూసి ప్రేమించి నీకు కనిపించటం జరిగింది. నీవు నన్ను ప్రేమిస్తున్నట్టే నేనూ నిన్ను ప్రేమిస్తు న్నాను. నేను మానవ స్త్రీని కాకపోయినప్ప టికీ నీపై గల ప్రేమ చేత నా లోకాన్ని వది లేసి, నీ లోకానికి వచ్చి నీకు భార్యగా ఉంటాను. అయితే ఒక్క నిబంధనమటు కున్నది : నన్ను పెళ్ళాడాక నీవు మరొక




స్త్రీని తలపనైనా తలవగూడదు. అలా చేశావో నీ ప్రాణానికే అపాయం. ఆ తరవాత నాకు ఆ జన్మ దుఃఖమే మిగులుతుంది. ఈ నియ మానికి నువ్వు కట్టుబడ దలిస్తేనే నన్ను పెళ్ళాడు," అన్నది.

అభిజితు నవ్వి, "నీవు నా భార్యవైతే నేను మరొక స్త్రీని తలవటం జరుగుతుందా ? అది అసంభవం. అందుచేత నీవు నా వెంట వచ్చెయ్యి," అన్నాడు.

చంద్రముఖి అతని వెంట అతని కోటకు వెళ్ళింది. వా రిద్దరికీ యథావిధిగా వివాహం జరిగింది. గ్రామంలో వాళ్ళంతా అతనికీ, అతని భార్యకూ కట్నాలూ, కానుకలూ

అర్పించారు. ఒక్కరైనా, "ఈ దొరసాని ఎవరు? ఎక్కడి నుంచి వచ్చింది? ఏ వంశానికి చెందినది?" అని అడిగిన పాపాన మాత్రం పోలేదు.

ఇప్పుడు అభిజితు ఆనందానికి హద్దు లేదు. అతను తన భార్యను ఒక్క క్షణం కూడా విడవకుండా, ఆమే లోకంగా కొంత కాలం గడిపాడు. యుద్ధం చెయ్యటంలో తనకు గల బలపరాక్రమాలకు అవకాశం లేకపోయిందే అన్న చింత మాత్రం అతన్ని ఎప్పుడైనా బాధించేది. కాని దేశమంతా శాంతి సౌఖ్యాలతో విరాజిల్లుతున్నది. యుద్ధాలు లేవు.

త్వరలోనే ఆ లోటు తీరింది. సాళ్వ చక్రవర్తికి పరిసర రాజ్యంతో యుద్ధం వచ్చి పడింది. యోధులైన వారంతా వచ్చి, చక్రవర్తికి యుద్ధంలో సహాయం చేసి విజయం చేకూర్చవలసిందని గ్రామగ్రామానా చాటింపు జరిగింది.

ఈ వార్త వినగానే అభిజితుకు భుజాలు పొంగాయి. యుద్ధోత్సాహం అతని నరాలలో తాండవించింది. అతను తన భార్యతో, "నేను వెళ్ళి యుద్ధంలో చక్రవర్తికి తోడ్పడి, ఆయనను మెప్పించి కానుకలూ, బహుమానాలూ తెస్తాను. నిజానికి మనం ఏమంత సంపన్నులం కాము," అన్నాడు.



చంద్రముఖి అతని ఉత్సాహం గమనించి, "అలాగే వెళ్ళిరా. కాని త్వరగా రావాలి. నేను నీ కోసం క్షణాలు లెక్కిస్తూ ఒంటరిగా ఉంటా నన్నది మరవవద్దు," అని చెప్పింది.

అభిజితు ఆమెతో, "యుద్ధం ముగిసిన మరుక్షణం బయలుదేరి వచ్చేస్తాను. నేను మాత్రం నిన్ను విడిచి ఒక్క క్షణం ఉండ గలనా?" అన్నాడు.

అతను తన ఆయుధాలన్నీ తీసుకుని గుర్రం ఎక్కి సాళ్వచక్రవర్తి వద్దకు వెళ్ళాడు. యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో సాళ్వచక్రవర్తికి విజయం చేకూరటమే గాక అభిజితు శౌర్యప్రతాపాలు చక్రవర్తిని ముగ్ధుణ్ణి చేశాయి.

అభిజితు ఇన్నాళ్ళూ చంద్రముఖిని అనుక్షణమూ జ్ఞాపకం చేసుకుంటూనే ఉన్నాడు. చివరకు యుద్ధరంగంలో శత్రువులను చీల్చి చెండాడేటప్పుడు కూడా అతనికి చంద్రముఖి రూపు కనిపిస్తూనే ఉన్నది, ఆమె కంఠం వినిపిస్తూనే ఉన్నది.

అందుచేత అతను చక్రవర్తి దర్శనం చేసుకుని, "మహారాజా, నేను వచ్చిన పని ముగిసింది గద! ఇక నాకు సెల విప్పించండి, నేను నా యింటికి వెళ్ళిపోతాను," అని విన్నవించుకున్నాడు.





"ఇప్పుడే గద యుద్ధం ముగిసింది? ఇంకా విజయోత్సవాలైనా జరపలేదు. ఆ ఉత్సవాలకు నీవు లేకపోతే ఎలా?" అన్నాడు చక్రవర్తి.

విజయోత్సవాలు చాలా పెద్ద ఎత్తున జరిపారు. ఆ ఉత్సవాల సమయంలో అభిజితు కీర్తి మరింత వ్యాప్తి చెందింది. ఇది అతనికి ఆనందంగానే ఉన్నప్పటికీ చంద్రముఖిని చేరుకోవాలనే తహతహ జాస్తి కావటం చేత అతను చక్రవర్తిని రెండోసారి సెలవు అడిగాడు.

ఈసారి చక్రవర్తి, "నీకు తగిన బహుమానం ఇచ్చి నేనే పంపుతానులే," అన్నాడు.

అసలు రహస్య మేమిటంటే, అభిజితు వంటి మహాయోధుడు తన కొలువులో ఉండాలని చక్రవర్తికి గాఢమైన కోరిక కలిగింది. అతను తన వద్ద కొలువు ఆశించక పోగా, ఇంటికి వెళ్ళిపోవాలని తహతహలాడటం చక్రవర్తికి కొంచమైనా నచ్చలేదు.

అందుచేత అతను మరికొన్ని రోజులయాక మూడోమారు సెలవిమ్మని అడిగే సరికి చక్రవర్తి, "నీవు యుద్ధంలో చూపిన శౌర్యప్రతాపాలకు బహుమానంగా నా కుమార్తె నిచ్చి పెళ్ళి చేద్దామనుకుంటున్నాను. త్వరలోనే ముహూర్తం పెట్టిస్తాను. అందుచేత ఇంటికి వెళ్ళే ఆలోచన ప్రస్తుతానికి కట్టిపెట్టు," అన్నాడు.

అభిజితు మొదట తన చెవులను తానే నమ్మలేకపోయాడు. ఊరూ పేరూ లేని తా నెక్కడ? చక్రవర్తి కుమార్తెను పెళ్ళాడట మేమిటి? ఇంతకంటె తనకు గొప్ప యోగం ఉండబోదు. చక్రవర్తి కూతురైనా అనాకారి కాదు. అయినా అభిజితుకు జలకన్య మీద ఉండిన ప్రేమ మరొకరి మీదికి పోయేది కాదు. చక్రవర్తికి అల్లుడయే ఖ్యాతి ఒక వంకా, చంద్రముఖి మీది ప్రేమ ఒక వంకా పీకుతూండగా ఎటూ నిర్ణయించుకోలేక అతను ఒక పండితుడి వద్దకు

వెళ్ళి, అయనకు తన పరిస్థితి అంతా దాచ కుండా చెప్పి, అయన సలహా కోరాడు.

అంతా విని ఆ పండితుడు, "ఇందులో ఆలోచించే దేమీలేదు. మానవులకూ జల దేవతలకూ మధ్య వివాహమనేది పూర్తిగా ధర్మ విరుద్ధం. అది వివాహమే కాదు. దానివల్ల నీకు ఉత్తమ లోకాలు కలగవు. అందుచేత ఆ భార్యను తక్షణమే విడిచి పుచ్చి, చక్రవర్తి కోరిన ప్రకారం ఆయన కుమార్తెను పెళ్ళాడటమే నీ కర్తవ్యం," అని చెప్పాడు.

అభిజితు చక్రవర్తి కుమార్తెను పెళ్ళాడ నిశ్చయించుకున్నాడు. ఈ విషయం అతను చక్రవర్తికి తెలిపాడు. వా రిద్దరికీ ఒక శుభ ముహూర్తాన పెళ్ళి కూడా జరిగింది. పెళ్ళి అనంతరం అభిజితును నదీ స్నానానికి తీసుకువెళ్ళారు.

స్నానం కోసం నీటిలో మునిగిన అభి జితు మళ్ళీ పైకి లేవలేదు. రాజభటులు నది అంతా గాలించినప్పటికీ అతని శవ మైనా దొరకలేదు.

అభిజితు నీటిలో మునిగిన క్షణంలోనే అతని కోటలో చంద్రముఖి కెవ్వున అర వటం వినిపించింది.

నౌకర్లంతా కేక విని పరిగెత్తుకు వచ్చారు. కాని ఆమె ఎవరికీ కనిపించకుండా అంత



ర్థానమైపోయింది. ఆ తరవాత ఆమెను కూడా చూసినవారు ఎవరూ లేరు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక్క సందేహం. అభిజితు జలకన్యకు చేసిన వాగ్దానం ఎందుకు తప్పాడు? ఆమె మీది ప్రేమ తగ్గటం చేతనా? లేక చక్రవర్తికి అల్లుడు కావాలన్న కోరిక ప్రబలం కావటం చేతనా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అభిజితు చేసిన పొరపాటు చక్రవర్తి కుమార్తెను పెళ్ళాడటం కానేకాదు. అతనికి చంద్రముఖి పైన గల ప్రేమలో లోపం కూడా ఏమీ లేదు. చంద్రముఖి పైన తనకు గల ప్రేమతో తన జన్మ పరిపూర్ణమవుతుందను కోవటమే అతను చేసిన పొరపాటు. పురుష లక్షణం గల వాడి జీవితం స్త్రీ యొక్క ప్రేమతో ఎన్నటికీ సమగ్రం కాదు. పురుషుడైన వాడికి కీర్తి కూడా కావాలి. అభిజితు మహాయోధుడు. అందుచేతనే తన శౌర్య పరాక్రమాలు ప్రదర్శించే అవకాశం దొరకగానే, తన ప్రాణంలాటి భార్యను కూడా విడిచి యుద్ధానికి బయలుదేరాడు. యుద్ధం మూలంగా అతనిపై చక్రవర్తికి అభిమానం పుట్టుకొచ్చింది. అందుకే ఆయన అతన్ని తన యింట కట్టి ఉంచుకో గోరి తన కుమార్తె నిచ్చి చేస్తా నన్నాడు. చక్రవర్తి ఇచ్చే కానుకలు నిరాకరించటం ఎంత అస్వాభావికమో, ఆయన కుమార్తెను నిరాకరించటం కూడా అభిజితుకు అంత అస్వాభావికమే. చక్రవర్తికి అల్లుడు కావటం అన్నది అభిజితు సంపాదించుకున్న కీర్తిలో ఒక భాగమే గనక అతను దాన్ని నిరాకరించలేకపోయాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# గంధర్వ చక్రవర్తి కూతురు

పూర్వం బస్రా నగరంలో హసన్ అనే యువకు డుండేవాడు. హసన్ అంటే సౌందర్య మని అర్థం. ఆ పేరు వాడికి సార్థకమయింది. ఎందుకంటే ఆ కాలంలో బస్రా నగరంలో హసన్ వంటి సౌందర్య వంతుడు మరొకడు లేడు. వాడు తల్లి దండ్రులకు ఒక్కడే బిడ్డ కావటంచేత కాస్త గారాబంగా పెంచారు. దానికి తగ్గట్టు వాడి తండ్రి వాడి చిన్నతనంలోనే చనిపోయాడు. ఆ తరవాత కొద్ది కాలంలోనే తండ్రి మిగి ల్చిన డబ్బు కాస్తా హసన్ మిత్రులతో విందులు చేసి తగలేశాడు.

ఆ తరవాత వాడి తల్లి తన డబ్బుతో పెద్ద బజారులో ఒక నగలు చేసే దుకాణం కొని పెట్టింది. వాడు రోజూ ఆ దుకాణంలో కూచుని బంగారు నగలు చేస్తూ ఉండే వాడు. వాడి అందం దారేపోయే పిన్న లనూ, పెద్దలనూ ఆకర్షించేది.

ఒకనాడు హసన్ తన దుకాణంలో కూచుని పని చేసుకుంటూండగా ఒక పర్షియాదేశపు వృద్ధుడు, తెల్ల తలపాగా ధరించి, పొడుగాటి తెల్లని గడ్డంతో సహా అటుగా వెళుతూ హసన్‌ను చూసి ఆగి పోయాడు. మనిషి చూస్తే చాలా గౌరవ నీయుడి లాగున్నాడు.

ఇంతలో మధ్యాన్నపు ప్రార్థనలకు వేళ అయింది. వీధులన్నీ ఖాళీ అయాయి. వృద్ధుడు హసన్ దుకాణంలోకి అడుగుపెట్టి హసన్‌కు సలాం చేశాడు. హసన్ తిరిగి ఆ వృద్ధుడికి సలాం చేసి ఆయనను కూచో మని మర్యాద చేశాడు.

వృద్ధుడు కూచుని చిరునవ్వు నవ్వుతూ, "నాయనా, నాకు సంతానం లేదు. నిన్ను చూడగానే పెంచుకోవాలనీ, నా విద్య నీకు నేర్పాలనీ కోరిక కలిగింది. నా అనంతరం నీవు ఆ విద్యను అభ్యసించవచ్చు. ఇలా

సి. మాధవరావు




నగలు చేసి శ్రమపడి నీ అందమూ, ఆరోగ్యమూ చెడగొట్టుకోవలిసిన అవసరం లేదు. నా విద్య ఎంత అపురూపమైనదంటే దాన్ని సంపాదించటానికి ఎన్ని వేలమందైనా ప్రాణాలు అర్పించి ఉందురు. నిన్ను ఈ దుకాణంలో చూసేవరకూ నాకు ఈ విద్యను మరొకరికి నేర్పాలనే ఆలోచనే రాలేదు," అన్నాడు.

అంతా విని హసన్, "సరే, నన్ను పెంచుకుని నాకు మీ విద్య నేర్పెయ్యండి. ఎప్పుడు నేర్పుతారు?" అని అడిగాడు.

"రేపు," అని చెప్పి పర్షియను అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఆనందంతో కూడిన ఆరాటంలో హసన్ దుకాణం మూసేసి, తల్లి దగ్గిరికి పరిగెత్తుకు పోయి, ఈ సంగతంతా ఆమెతో చెప్పాడు.

ఆమె హసన్‌తో, "నాయనా, పర్షియన్ నాస్తికుల మాటలు నమ్మవచ్చా? వాళ్ళు అగ్నిని ఆరాధిస్తారు. వాళ్ళకు తెలిసిన విద్య బంగారం చెయ్యటం. కాని వాళ్ళ స్నేహం చేసినవాళ్ళెవరూ, బాగుపడరు, నాశనమై పోతారు," అన్నది.

హసన్ నిర్లక్ష్యంగా నవ్వి, "అమ్మా, మనం పేదవాళ్ళం. మన నుంచి ఎవరూ ఏమీ దోచుకోలేరు. ఆ ముసలాడు ఎంతో యోగ్యుడులాగున్నాడు. ఆయన దయ మన మీద ప్రసరించటం వల్ల మనకు లాభమే కలుగుతుంది," అన్నాడు.

ఎటూ చెప్పలేక తల్లి ఊరుకున్నది. ఆత్రంతో తహతహలాడిపోతూ హసన్ ఆ రాత్రి కన్ను మూయలేదు. మర్నాడు తెల్లవారుతూనే వాడు లేచి తన దుకాణానికి వెళ్ళాడు. కొంతసేపట్లో పర్షియను వచ్చాడు. ఆయన హసన్‌ను కౌగలించుకుని, "నీకు పెళ్ళి అయిందా, బాబూ?" అని అడిగాడు.

"ఇంకా లేదు. మా అమ్మ నన్ను పెళ్ళాడమని చాలా రోజులుగా తొందర చేస్తోంది," అన్నాడు హసన్.

"భేష్! నా విద్య బ్రహ్మచారులకి మాత్రమే చెప్పేది," అంటూ వృద్ధుడు, "పాతరాగి ఏమైనా నీ వద్ద ఉన్నదా?" అని అడిగాడు.

హసన్ విరిగిపోయిన రాగిపళ్ళెం ఒకటి తెచ్చి వృద్ధుడికి చూపాడు.

"అదే కావలిసింది. ఈ రాగిని ముక్కలు ముక్కలుగా నరికి ఆ ముక్కలను మూసలో పెట్టి, కొలిమిలో పెట్టి, తిత్తి పోసి కరిగించు," అన్నాడు వృద్ధుడు.

త్వరలోనే హసన్ ఆ పాతరాగిని కరిగించాడు. అప్పుడు వృద్ధుడు లేచి వచ్చి, "హక్, మక్, బక్! రాగి బంగారం కావాలి!" అని మూడుసార్లు అని, తన తలపాగా ముడతల్లో నుంచి ఒక పొట్లం తీసి, అందులో నుంచి కుంకంపువ్వు రంగు గల పొడి చిటికెడు తీసి మూసలో వేశాడు. వెంటనే మూసలోని రాగి నీరు గడ్డ కట్టుకు పోయి బంగారు కణిక అయింది.

హసన్ ఇది చూసి నివ్వెరపోయాడు. వృద్ధుడి ఆదేశానుసారం అతను ఆ కణికెను గీటురాయి మీద గీసి చూస్తే అది కల్తీలేని మేలిమి బంగారమని రుజువయింది. ఆ బంగారానికి నగల వర్తకులు మంచి ధర ఇస్తారు.



వృద్ధుడు హసన్‌తో, "వెంటనే దాన్ని తీసుకుపోయి బజారులో అమ్మి డబ్బు తెచ్చుకో. ఇది ఎలా వచ్చిందీ ఎవ్వరికీ చెప్పకు," అన్నాడు.

హసన్ దాన్ని రెండువేల దీనారాలకు అమ్మి, ఆ డబ్బు తీసుకుని ఇంటికి వెళ్ళి, తల్లికి చూపించి, ఇదంతా పర్షియను దయ వల్లనే సాధ్యపడిందని చెప్పాడు. ఈ మాట అన్నందువల్ల తల్లి అనుమానా లేవీ రహితం కాలేదు. అయినా హసన్ ఆమె అనుమానాలు లక్ష్యపెట్టక, తమ వంట ఇంట్లో ఉండే ఇత్తడి సన్నికల్లు తీసుకుని తన దుకాణానికి పరిగెత్తాడు.





వృద్ధు డింకా దుకాణంలోనే ఉన్నాడు. హసన్ సన్నికల్లును ఒకపక్క పెట్టి కొలిమికి తిత్తిపోసి మంట చేస్తూండటం చూసి వృద్ధుడు, "ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.

"దీన్ని కూడా బంగారంగా మార్చుదాం," అన్నాడు హసన్.

వృద్ధుడు నవ్వి, "ఒక్కరోజు నీ దగ్గిర ఇంత బంగారం ఎలా వచ్చిందని అందరూ అనుమానించరా? నీ రహస్యం ఎలా దాగుతుంది?" అన్నాడు.

"అది నిజమేగాని, మీ విద్య త్వరగా నేర్చుకోవాలని నాకు తహతహగా ఉంది," అన్నాడు హసన్. వృద్ధుడు గట్టిగా నవ్వి, "ఇది నడి బజారులో నేర్చుకునే విద్య అనుకున్నావా? నిజంగా ఈ విద్య నేర్చుకోవాలంటే నీ పనిముట్లన్నీ తీసుకుని మా యింటికి రా," అన్నాడు.

సరేనని హసన్ వృద్ధుడి వెంట బయలుదేరాడు. కాని వీధిలో నడుస్తూండగా అతనికి, పర్షియన్ నాస్తికులను గురించి తన తల్లి చేసిన హెచ్చరిక జ్ఞాపకం వచ్చింది. అతను నడిచేవాడల్లా చప్పున ఆగిపోయి తీవ్రమైన ఆలోచనలో పడ్డాడు. ముసలివాడు ఆ సంగతి గ్రహించాడు.

"బిడ్డా, నిన్నేదో సంకోచం పట్టి పీడిస్తున్నట్టున్నది. ఈ పరుసవేది విద్యను మా ఇంట నేర్చుకోవటానికి నీ కేమైనా అభ్యంతరం ఉంటే మీ యింటికే వచ్చి నేర్పుతాను," అన్నాడు వృద్ధుడు.

అలా చేస్తే తన తల్లి భయాలకు తావుండదనుకుని హసన్ సరే నన్నాడు. ఇద్దరూ కలిసి హసన్ ఇంటికి వెళ్ళారు. వృద్ధుణ్ణి బయటి వసారాలో ఉండమని హసన్ లోపలికి వెళ్ళి, "అమ్మా, ఆయన మన ఇంటికి అతిథ్యానికి వచ్చాడు. ఒకసారి మన ఉప్పు తిన్నాక ఇక మన కెలాటి ద్రోహమూ చెయ్యడు," అన్నాడు.



"నాయనా, అలాటి పట్టింపులు మనకే గాని అగ్నిని పూజించే నాస్తికుల కుండవు. నీ క్షేమం గురించి నా ఆరాటం తీరిందను కోకు. అతిథిని తెచ్చావు గనక వంట చేసి పెడతాను గాని, ఆ మనిషి లోపలికి వస్తే నేనీ చూరు కింద కూడా ఉండను. పొరుగింటికి వెళ్ళి ఆ మనిషి వెళ్ళిపోయాకే మళ్ళీ ఇంట అడుగు పెడతాను," అన్నది.

అలాగే ఆమె రకరకాల కూరలు కొని తెచ్చి పుష్కలంగా వంటకాలు తయారు చేసి, వాటిని తినటానికి సిద్ధంగా ఉంచి పొరుగింటికి వెళ్ళిపోయింది.



తరవాత హసన్ వృద్ధుణ్ణి లోపలికి తీసుకువచ్చి భోజనానికి కూచోబెట్టి, "మా యింట మీరు భోజనం చేశాక మన మధ్య బంధం ఏర్పడుతుంది," అన్నాడు.

"అది చాలా పవిత్రమైన బంధం, నాయనా! నీ మీద ఎంతో ప్రేమ లేకపోతే ఈ అపూర్వమైన విద్య నీకు చెబుతానా?" అంటూ వృద్ధుడు తన తలపాగాలో నుంచి పొట్లం తీసి, "చూడు, ఇందులో ఉన్న పొడితో ఎన్నో మణుగుల బంగారం చేయవచ్చు. ఇందులో వెయ్యి మూలికలూ, వెయ్యి దినుసులూ చేర్చి ఎంతో శ్రమపడి తయారుచేశాను. ఆ పద్ధతంతా నీకు నేను చెబుతాను," అంటూ ఆ పొట్లాన్ని హసన్‌కు అందించాడు.

హసన్ ఆ పొడిని ఆశ్చర్యంతో చూసే సమయంలో హసన్ పళ్ళెంలో కొంత ఆహారం పెట్టి అందులో వృద్ధుడు మత్తు మందు కలిపి, "తిను, నాయనా!" అన్నాడు. హసన్ ఒక్క ముద్ద నోట పెట్టుకుంటూనే స్పృహ తప్పి పడిపోయాడు.

"ఇప్పుడు నా నుంచి తప్పించుకు పోలేవు రా, బిడ్డా!" అంటూ వృద్ధుడు తాను కూచున్నచోటు నుంచి లేచి, హసన్ కాళ్ళు మడతపెట్టి రొమ్ముకు బిగగట్టి, అక్కడ వున్న ఒక బట్టలపెట్టె ఖాళీ చేశాడు.



తరవాత ఆ దుర్మార్గుడు హసన్‌ను ఆ పెట్టెలో పెట్టి, ఇంట్లో ఉన్న డబ్బంతా తీసుకుని, బయటికి వెళ్ళి ఒక కూలీని మాట్లాడి తెచ్చి, వాడిచేత పెట్టె మోయించుకుని తిన్నగా రేవుకు వెళ్ళాడు. అక్కడ ఒక ఓడ సిద్ధంగా ఉన్నది. ఓడ సరంగు వృద్ధుణ్ణి చూడగానే పెట్టెతో సహా ఎక్కించుకుని, లంగరు ఎత్తి ఓడను సముద్రం మీదికి నడిపించాడు.

కొంత సేపయాక హసన్ తల్లి ఇంటికి వచ్చి చూసుకుంటే హసన్ లేడు, పెట్టె లేదు. కిందటి రోజు హసన్ బంగారం అమ్మి తెచ్చిన డబ్బు కూడా లేదు. పెట్టెలో ఉండిన బట్టలన్నీ చెల్లాచెదరుగా పడి ఉన్నాయి. బయటి వాకిలి తెరిచి ఉన్నది. ఆమె తల బాదుకుని, తన బట్టలు చించుకుని కొడుకును మళ్ళీ చూడననీ, భయపడినంతా అయిందనీ ఏడ్చింది. ఆమెను ఓదార్చటం ఇరుగుపొరుగు వాళ్ళకు సాధ్యంకాలేదు.

ఆమె తన నట్టింట కొడుకు పేర ఒక చిన్నగోరీ కట్టించి, అహోరాత్రాలు దాని దగ్గిరేపడి ఏడుస్తూ కాలం గడపసాగింది.

హసన్‌ను మాయజేసి పట్టుకుపోయిన పర్షియను ఒక భయంకర మాంత్రికుడు. వాడి పేరు బెహ్రామ్. వాడు తన మాయ విద్యలకు ఎందరో ముస్లిము కుర్రాళ్ళను బలి ఇచ్చాడు. ఈసారి వాడికి హసన్ దొరికాడు.

సముద్ర ప్రయాణం సాగిన న్నాళ్ళూ బెహ్రాం హసన్‌ను పెట్టెలోనే ఉంచి మత్తు మందు కలిపిన ఆహారం పెడుతూ వచ్చాడు. కొన్నాళ్ళకు ఓడ అవతలి తీరాన్ని చేరింది. బెహ్రాం పెట్టెతో సహా ఒడ్డున దిగాక ఓడ వెళ్ళిపోయింది. అప్పుడు ముసలివాడు హసన్‌ను పెట్టెలో నుంచి పైకితీసి, కట్లు ఊడదీసి, వాడి మత్తు వదలటాని కేవో మందులు వాసన చూపించాడు.

హసన్ కళ్ళు తెరిచి చూసేసరికి తాను సముద్రం ఒడ్డున ఉన్నట్టు తెలిసింది. కాని అది వాళ్ళ దేశంకాదని కూడా తెలిసింది. ఎందుకంటే ఈ సముద్రతీరాన ఇసుకలో నల్లని, తెల్లని, పచ్చని, ఎర్రని గులకరాళ్ళున్నాయి. వాడు ఆశ్చర్యంతో లేచి నిలబడగానే వెనకగా ఒక రాతి మీద కూచుని ముసలాడు కనిపించాడు. వాడే తనని మోసం చేసి ఇక్కడికి తెచ్చాడనీ, తల్లి అన్న మాటలు అక్షరాలా నిజమయాయనీ హసన్ గ్రహించాడు.

అతడు ముసలాడి దగ్గిరికి పోయి, "నాయనగారూ, ఇదంతా ,ఏమిటి? మా ఇంటి ఉప్పు తిన్నారే!" అన్నాడు.

ముసలాడు గట్టిగా నవ్వి, "అగ్నిని పూజించే బెహ్రాంకు ఉప్పు తిన్న నిర్బంధమేమిటి? నీ వంటి ముస్లిము యువకుల్ని తొమ్మిదివందల తొంభైతొమ్మిదిని బలి ఇచ్చాను. నువు వెయ్యోవాడివి. నా చేతిలో చిక్కావు. తప్పించుకోలేవు. నీ దేవుణ్ణి విడిచి పుచ్చి నాలాగా నువ్వు కూడా అగ్నిని అర్చించు," అన్నాడు.

. ఆ మాటలకు మండిపోయి, "నీచుడా, ఏమిటి నువ్వనేది?" అని హసన్ గట్టిగా అరిచాడు.




వెంటనే బెహ్రాం తన వాలకం మార్చేసి, "నిన్ను పరీక్షించటానికి కలా అన్నాను, నాయనా! భేష్, పరీక్షలో నెగ్గావు. ఏకాంత ప్రదేశంలో నీకు నా విద్య చెబుదామనే ఉద్దేశంతోనే ఇక్కడికి తెచ్చాను. అదుగో ఆ కనబడే కొండ చూశావా? దాని శిఖరం మబ్బుల కన్న ఎత్తుగా ఉంది. అందుచేత దాన్ని మబ్బులకొండ అంటారు. మనకు కావలిసిన మూలికలన్నీ దానిమీద ఉన్నాయి. మనం ఇప్పు డక్కడికి ఎక్కాలి," అన్నాడు.

హసన్ అనుమానం కొంత తగ్గింది. అతను బెహ్రాంతో, "ఆ కొండ గోడలాగా

ఉండే, దాని శిఖరానికి ఎలా ఎక్కటం?" అని ప్రశ్నించాడు.

"మనకు ఎక్కవలిసిన పనేలేదు. పక్షుల్లాగా వెళ్ళి అక్కడ వాలుదాం," అంటూ బెహ్రాం తన పైబట్ట లోపలినుంచి ఒక రాగి తప్పెట తీశాడు.

దానిపైన కోడిపుంజు చర్మం పరిచి ఉన్నది. ఆ చర్మం మీద ఏవో బీజాక్షరాలు రాసి ఉన్నాయి.

బెహ్రాం ఆ తప్పెట మీద వేళ్ళతో వాయించగానే పెద్ద ఎత్తున ధూళి లేచి, అది లేచినచోట ఒక నల్లని రెక్కల గుర్రం ప్రత్యక్షమయింది. దాని ముక్కు నుంచి జ్వాలలు వెలువడుతున్నాయి. బెహ్రాం దాని పైన ఎక్కి కూచుని, హసన్‌కు సహాయం చేసి తన వెనక ఎక్కించుకున్నాడు. వెంటనే ఆ గుర్రం రెక్క లాడించి, రివ్వున గాలి లోకి లేచి, కనురెప్పపాటు కాలంలో మబ్బులకొండ శిఖరం మీద వాలింది. తరవాత బెహ్రాం, హసన్ లిద్దరూ కిందికి దిగగానే అదృశ్యమైపోయింది.

హసన్ అనుమానాలు తిరిగి వచ్చాయి. వాడు చుట్టూ కలయజూస్తే ఏ విధమైన మూలికలూ లేవు. బెహ్రాం వాడితో, "ఇప్పుడు నిన్ను ఏ ప్రాణీ రక్షించలేదు! నా నుంచి ఎలా తప్పించుకుంటావు?" అని బిగ్గరిగా నవ్వాడు.

హసన్‌కు పట్టరాని ఆగ్రహం వచ్చేసింది. "నీచుడా, నాకు అల్లా అండ ఉన్నది. చూడు అల్లా సహాయంతో నిన్నేం చేస్తానో!" అంటూ ఒక చేత్తో ముసలాడి చేతిలో ఉన్న రాగితప్పెట లాగేసి, రెండో చేత్తో బలం కొద్దీ అతణ్ణి కొండ మీది నుంచి తోసేశాడు. బెహ్రాం గాలిలో పిల్లిమొగ్గలు తిరుగుతూ, ప్రాణ భయంతో అరుస్తూ కిందపడి రాళ్ళమీద పచ్చడి అయిపోయాడు.

ఆ మాంత్రికుడికి భూమి మీద నూకలు చెల్లిపోయాయి. [ ఇంకా ఉంది ]







# అమ్మ చెప్పిన మాటలు

"చూడు, తాతయ్యా, కిష్టుడు వాళ్ళమ్మ ఏం చెప్పినా వినక మొండి కేస్తున్నాడూ!" అని పిల్లలు కిష్టుడి మీద తాతయ్యతో ఫిర్యాదు చేశారు.

"ఏం రా, కిష్టూ? నిజమేనా?" అని తాతయ్య కిష్టుగాణ్ణి అడిగాడు.

"ఏం చేసినా అమ్మ వద్దంటుంది, తాతయ్యా. నీళ్ళతో ఆడుకో వద్దంటుంది, పిల్లి తోక పట్టుకో వద్దంటుంది, జామచెట్టె క్కొద్దంటుంది," అని కిష్టుడు వాళ్ళమ్మ మీద ఎదురు ఫిర్యాదు చేశాడు.

"ఏదో కారణం లేకపోతే అమ్మ ఎందుకు వద్దంటుంది రా? నీ మంచికోరే గదా ఏ పని అయినా మానమంటుంది! నువ్వేమో వేలె డంత వాడివి. నీకు ఏమీ తెలీదు. అలా టప్పుడు అమ్మ చెప్పినట్టు వినాలా వద్దా? నేను మీకు వెనక ఒంటెపిల్ల కథ చెబితినే, ఆ కథలో—" అన్నాడు తాతయ్య.

అంతలో నే అందరూ ఒక్కసారిగా, "ఒంటెపిల్ల కథ నువు చెప్పలేదు, తాతయ్యా? ... అబద్ధా లాడుతున్నావు, తాతయ్యా! ఒంటెపిల్ల ఏం చేసింది, తాతయ్యా?" అని తలా ఒక మాటా తాతయ్య నడిగారు.

తాతయ్య రొండి నుండి పొడుంకాయ తీస్తూ, "ఓరీ, మీకు ఒంటెపిల్ల కథ చెప్పనే లేదుట్రా? పోనీ, మునిగిపోయిం దేముందీ? ఇప్పుడు చెబుతాను వినండీ!" అంటూ కథ ప్రారంభించాడు:

వెనక మావారు దేశపురాజు కూతుర్ని మీవారు దేశపురాజు కొడుక్కిచ్చి పెళ్ళి చేశారు. పెళ్ళికూతురికి అరణంగా వెయ్యి ఒంటెల్ని పంపటానికి నిశ్చయించారు. తీరా పంప వలిసిన సమయానికి ఒక ముసలి ఆడ ఒంటెకు సుస్తీ చేసింది. అది దారి లోనే చస్తుందో యేమోనని, అది ఈనిన

ఒంటెపిల్లను, కొద్దిరోజుల వయసు గల దాన్ని వెయ్యో ఒంటె కింద లెక్కగట్టి మిగతా ఒంటెలతో బాటు ప్రయాణం చేయించారు.

ఆ ఒంటెపిల్లకు అమ్మని విడిచి వెళ్ళటం ఏ మాత్రమూ ఇష్టంలేదు. (మన కిష్టుడు, చూడరాదూ, అమ్మ చెప్పిన మాట విన డన్న మాటేగాని కాస్సేపు అమ్మ కనిపించక పోతే ఎలా కాలు గాలిన పిల్లిలా ఇల్లూ దొడ్డీ తిరిగొస్తాడో!) అందుచేత ఆ ఒంటె పిల్ల ఏంచేసిందీ? కాపలావాళ్ళను తప్పించు కుని పారిపోయి తల్లి దగ్గిరికి వచ్చి చేరింది. అప్పటికే తల్లి ఒంటె చావు బతుకుల్లో ఉన్నది. అది తన పిల్లతో అన్నది కదా, "నాయనా, నే నింకా ఎంతోసేపు బతకను! నువు వెళ్ళి మీ అన్నను కలుసుకుని, ఎప్పుడూ అన్న వెంటనే ఉండు. మీ అన్నను కలుసుకునే లోపుగా దారిలో దిబ్బల మీద పడుకోకు. మనుషులు మజిలీచేసి వెళ్ళిన స్థలాల్లో పడుకోకు. మిగిలిన ఒంటెలను చేరుకున్నాక మంద మధ్యనే నడు; అంతే గాని ముందూ, వెనకా, పక్కలా నడవకు. మీ అన్నను అస్తమానం అంటిపెట్టుకునే ఉండు. నేను చెప్పినట్టు చేస్తివా నీకు క్షేమం కలుగుతుంది," అని కొడుక్కు బుద్ధులు చెప్పి కన్ను మూసేసింది.



ఒంటెపిల్ల తల్లి కోసం కాస్సేపు ఏడిచి, ఒంటెల గుంపుతో వెళుతున్న తన అన్నను చేరుకోవటానికి బయలుదేరింది.

దారిలో చీకటి పడింది. ఒంటెపిల్ల ఆ రాత్రికి ఎక్కడ పడుకుందామా అని చూస్తే దగ్గరలోనే ఒక దిబ్బ కనిపించింది. "అమ్మ దిబ్బల మీద పడుకోవద్దంది. పడుకుంటే ఏం జరుగుతుందో చూద్దాం," అనుకుని ఆ దిబ్బ మీద పడుకుంది. ఒక రాత్రి వేళ ఈదురుగాలి సాగింది. ఒంటెపిల్లకు చచ్చే చలి పుట్టుకొచ్చింది. "ఓహెూ, ఇందుకా అమ్మ దిబ్బల మీద పడుకోవద్దన్నది?" అనుకుంది ఒంటెపిల్ల.

మర్నాడంతా అది నడిచి మళ్ళీ రాత్రి అయేసరికి ఒక ప్రదేశానికి వచ్చింది. అక్కడ మనుషులు మజిలీ చేసిన చోటు కనబడింది. "ఇలాటిచోట కూడా అమ్మ నన్ను పడుకోవద్దన్నది. పడుకుంటే ఏం జరుగుతుందో చూద్దాం," అనుకుని ఒంటెపిల్ల అక్కడే పడుకున్నది.

మనుషులు పారేసిపోయిన ఆహారం కోసం ఒక రాత్రివేళ ఏవేవో క్రూరమృగాలు వచ్చాయి. నక్కల కూతలూ, తోడేళ్ళ అరుపులూ విని ఒంటెపిల్ల హడిలిపోయి పడుకున్నచోటి నుంచి పారిపోవలిసి వచ్చింది. "ఓహెూ, ఇందుకా అమ్మ నన్ను మజిలీ



స్థలాల్లో పడుకోవద్దన్నది ?" అనుకున్నది ఒంటెపిల్ల.

మర్నాడు ఒంటెపిల్ల ఒంటెల మందను చేరుకున్నది. కాని దాన్ని అన్న వెంటనే ఉండమనీ, మంద మధ్యనే నడవమనీ అమ్మ చెప్పింది. దానికి, మరి, తల్లి మాటల మీద ఇంకా పూర్తిగా గురి కుదరలేదుగా! అందుకని అది మంద ముందు నడవటానికి యత్నించింది. ఈ పిల్ల ఒంటె తమ కాళ్ళకు అడ్డంగా ఉండటం చూసి వెనక ఉన్న ఒంటెలు దాని వీపూ, తోకా కొరక యత్నించాయి.

ముందు నడిస్తే లాభం లేదనుకుని ఒంటెపిల్ల మంద వెనకచేరి నడవసాగింది. ఒంటెలను తోలుకుపోయేవాళ్ళు అదిలించటానికి విసిరే కర్రలు దానికి తగిలాయి.

ఈ విధంగా వెనక నడిచినా కష్టమే అని తెలుసుకుని ఒంటెపిల్ల మంద పక్కగా నడవటానికి యత్నించింది.

అయితే మంద దారి వెంట రేపే దుమ్మంతా దాని ముక్కులా, నోటా పోయింది.

"ఓహెూ, ఇందుకా అమ్మ నన్ను మంద మధ్య నడవమనీ, అన్న వెంటనే ఉండమనీ చెప్పింది ?" అనుకుని ఒంటెపిల్ల మంద మధ్యనున్న తన అన్నను చేరుకుని నడవసాగింది. అప్పుడు దానికి నడక సుఖంగా సాగింది. వేళకు తిండీ, నీరూ సక్రమంగా అందాయి. అన్న ఒంటె దాన్ని చక్కగా కనిపెట్టి ఉంటూ, కబుర్లు చెబుతూ, ప్రయాణ శ్రమ ఏమీ తెలియకుండా ఒంటెపిల్లను తీసుకుపోయింది.

తాతయ్య ఈ కథ చెప్పి, "అందుచేత, ఒంటెపిల్ల లాటి కొంటెపిల్లాడా! నువు కూడా మీ అమ్మ చెప్పిన మాట వింటే సుఖపడిపోతావు," అన్నాడు.

పిల్లలందరూ, "ఒంటెపిల్లాడు! కొంటెపిల్లాడు!" అని అరుస్తూ కిష్టుణ్ణి కాస్సేపు ఏడిపించి ఆనందించారు.





# సీమంతిని

పూర్వం చిత్రవర్మ అని ఒక రాజుండేవాడు. ఆయనకు వరసగా ఎనిమిది మంది కొడుకులు పుట్టిన మీదట ఒక కూతురు పుట్టింది. ఆమెకు సీమంతిని అని పేరు పెట్టుకుని చిత్రవర్మ అతి గారాబంగా పెంచుతూ వచ్చాడు.

ఒకప్పుడు జ్యోతిష్కులు సీమంతిని జాతకం చూసి, ఈమెకు వైధవ్యం కలుగుతుందని చిత్రవర్మకు చెప్పారు. చిత్రవర్మ ఈ సంగతి తెలిసి ఎంతో దిగులుపడి, ఈ మాట సీమంతినికి తెలియకుండా దాచి ఆమెకు వివాహం చేసే ఆలోచన చేశాడు.

అయితే రహస్యం దాగలేదు. తనకు వైధవ్యం కలగనున్నదని తెలిసి సీమంతిని సోమవార వ్రతాలు చేస్తూ శివుణ్ణి ఆరాధించ సాగింది.

కొంతకాలమయాక సీమంతినిని చంద్రాంగదు డనే నిషధదేశపు రాజకుమారుడి కిచ్చి పెళ్ళి చేశారు. ఈ చంద్రాంగదుడు నలదమయంతుల మనమడు, ఇంద్రసేనుడి కొడుకు. పెళ్ళి అయినాక అల్లుణ్ణి తన ఇంటనే ఉంచుకుని చిత్రవర్మ వెయ్యి కళ్ళతో కాపాడుతూ వచ్చాడు.

ఒకసారి చంద్రాంగదుడు సపరివారంగా ఒక నావలో ప్రయాణమై పోతూండగా పెద్ద గాలి వీచి పడవ కాస్తా నీటిలో మునిగిపోయింది.

నీటిలో మునిగిపోయిన చంద్రాంగదుణ్ణి కొందరు నాగకన్యలు చూసి తమ వెంట పాతాళలోకానికి తీసుకుపోయారు. నాగరాజైన తక్షకుడు చిత్రవర్మకు మిత్రుడు. అందుచేత చిత్రవర్మ అల్లుడైన చంద్రాంగదుడికి చక్కని ఆతిథ్య మిచ్చి, తమ లోకంలో మూడేళ్ళపాటు ఉంచుకున్నాడు.

నావలో ప్రయాణమై వెళ్ళిన తన భర్త తిరిగి రాకపోయే సరికి జోస్యం నిజమయిం

పురాణ కథ

దనుకుని సీమంతిని అలంకారాలు తీసేసి విధవరాలి వేషం ధరించి, శివుణ్ణి మాత్రం నిష్ఠగా ఆరాధిస్తూ వచ్చింది.

"నేను వచ్చి చాలా కాలమయింది. నా వాళ్ళు నా కోసం దుఃఖపడుతూ ఉంటారు. నా కిక సెల విప్పించండి," అని చంద్రాంగదుడు తక్షకుడితో చెప్పి నాగకన్యల సహాయంతో భూలోకానికి తిరిగి వచ్చాడు.

భార్యాభర్తలు ఒకరినొకరు గుర్తించుకోవటం కూడా కష్టమయింది. తన భర్త చనిపోలేదని తెలుసుకున్నాక సీమంతిని తాను చేసిన శివపూజే తన భర్తను కాపాడింది కదా అనుకున్నది.

నాగలోకం నుంచి తిరిగివచ్చాక చంద్రాంగదుడు సీమంతినిని వెంటబెట్టుకుని తమ నగరమైన నిషధకు బయలుదేరి వెళ్ళాడు. అక్కడ వారిద్దరికీ మరొకసారి వైభవంగా వివాహం జరిగింది.

ఇప్పుడు సీమంతిని తన భర్తను తిరిగి పొందిన సంతోషంలో సోమవార వ్రతం చేసినప్పుడల్లా దంపతులకు దానాలుగా కానుక లిస్తూ రాసాగింది. ఎందరో దంపతులు వచ్చి ఆమె చేత లేదనిపించుకోకుండా కానుకలు పుచ్చుకుపోతున్నారు.

ఇలా ఉండగా విదర్భదేశంలో ఇద్దరు బ్రాహ్మణ కుమారు లుండేవారు. ఒకడి



పేరు సోమవంతుడు, రెండో వాడి పేరు సుమేధుడు.

వాళ్ళిద్దరూ ఒకే గురువు వద్ద చదువు పూర్తిచేసి తమకు పెళ్ళిళ్ళు చెయ్యమని తమ తండ్రుల నడిగారు.

"మీ పెళ్ళిళ్ళు చెయ్యటానికి మా దగ్గిర డబ్బు లేదు. రాజు వద్దకు వెళ్ళి, మీ విద్యలు ప్రదర్శించి, రాజును మెప్పించి, డబ్బు సంపాదించి పెళ్ళిళ్ళు చేసుకోండి," అని వాళ్ళ తండ్రులు చెప్పారు.

ఆ ఇద్దరు కుర్రవాళ్ళూ విదర్భరాజు వద్దకు వెళ్ళి, తమకు ధన సహాయం చేయమని అర్థించారు. రాజు నవ్వులకు, "మీకు డబ్బు కావాలంటే దంపతుల్లాగా వేషాలు వేసుకుని నిషధదేశపు రాణి అయిన సీమంతిని వద్దకు వెళ్ళండి. ఆమె దంపతులు వస్తే అంతులేని డబ్బూ బంగారమూ ఇస్తున్నది," అన్నాడు.

ఇలాటి మోసం ఎలా చేయుటమా అని సుమేధుడు వెనకాడాడు గాని సోమవంతుడు, "మరేమీ ఫరవాలేదు. దీనికింత ఆలోచన ఎందుకు? రాజాజ్ఞ పాటించటమే మన కర్తవ్యం," అన్నాడు.

తరవాత సోమవంతుడు స్త్రీ వేషం ధరించాడు. అతనూ సుమేధుడూ కలిసి దంపతులుగా నటిస్తూ సీమంతిని చేసే సోమ



వార వ్రతానికి వెళ్ళారు. తన మామూలు ప్రకారం వచ్చిన దంపతులందరికీ సీమంతిని కానుక లిచ్చి పంపింది.

"మన మోసం బయటపడేలోగా మనం ఈ నిషధను వదిలిపోవటం మంచిది," అన్నాడు సుమేధుడు. కాని సోమవంతుడు తన అడవేషం తీసివెయ్యటం అసంభవమయింది. ఎందుకంటే వాడు కాస్తా అడదిగా మారిపోయి సోమవతి అయిపోయాడు. పైపెచ్చు ఈ సోమవతికి సుమేధుడి పైన ఎక్కడలేని ప్రేమా పుట్టుకొచ్చింది. చేసేది లేక వాళ్ళిద్దరూ అలాగే విదర్భదేశం చేరి తమతమ ఇళ్ళకు వెళ్ళారు.

సోమవంతుడుగా వెళ్ళిన తన ఏక పుత్రుడు సోమవతిగా ఇంటికి తిరిగిరావటం చూసి సోమవంతుడి తండ్రి సారస్వతుడు విషయమంతా తెలుసుకున్నాడు. కుర్ర వాళ్ళకు ఇలాటి దిక్కుమాలిన సలహా ఇచ్చిన విదర్భరాజే ఇందుకు బాధ్యుడను కుని, ఆ బ్రాహ్మడు రాజు దగ్గిరికి వెళ్ళి, "నీ మూలంగా నా కొడుకు కాస్తా అడదై పోయాడు," అని జరిగిన సంగతి చెప్పాడు.

విదర్భరాజుకు ఆశ్చర్యమూ, విచారమూ కూడా కలిగింది. ఆయన పార్వతీ పరమేశ్వరులను ధ్యానించగా పార్వతీ దేవి ప్రత్యక్షమై, "రాజా, ఏం కావాలి?" అని అడిగింది.

"తల్లీ, సోమవతి తిరిగి సోమవంతుడయే లాగా అనుగ్రహించు!" అన్నాడు విదర్భరాజు.

"అది అసాధ్యం. ఏ క్షణాన సోమవంతుణ్ణి చూసి సీమంతిని ఆడ దనుకున్నదో ఆ క్షణానే అతను స్త్రీ అయిపోయాడు. సీమంతిని చేత దంపతి సత్కారం పొందిన వాళ్ళు దంపతులు కాక తప్పదు," అన్నది పార్వతీదేవి.

గత్యంతరం లేక తండ్రులు సోమవతికీ, సుమేధుడికీ పెళ్ళిచేశారు.



# దొంగ దొరికాడు!

ఒకసారి ఒక ఓడలో పెద్ద దొంగతనం జరిగింది. ఓడ సరంగు తనకు అను మానంగా ఉన్న వారందరినీ పట్టుకు వచ్చి అక్బరు ఎదట పెట్టి విచారణ జరపమని కోరాడు.

వారిలో ఎవరు దొంగ అయినదీ నిర్ణయించటం తనకు సాధ్యంకాక అక్బరు బీర్బల్‌ను అందుకు నియోగించాడు.

దొంగను పట్టటానికి బీర్బల్ ఒక యుక్తి పన్నాడు. అతను కొంత పిండి తెచ్చి అనుమానితులందరి చేతుల్లోనూ తలా కొంచెం పెట్టి, "ఈ పిండిని మీరు మీ ఉమ్మితో తడిపి నా కివ్వండి. మీలో దొంగ ఎవరో నేను వెంటనే కని పెట్టేస్తాను," అన్నాడు.

అందరూ తమ నోటి ఉమ్మితో తమ చేతుల్లోని పిండి తడిపారు. అసలైన దొంగ మాత్రం, భయంతో నోరెండుకుపోయి, పిండి తడపలేక పోయాడు. వాణ్ణి నిలవదీసి అడగగా నిజం ఒప్పుకున్నాడు. దొంగను పట్టిచ్చినందుకు అక్బర్ బీర్బల్‌కు మంచి బహుమానం ఇచ్చాడు.





# మోసగాడు

భీమన్నను తెలివిగల వాణ్ణి చెయ్యటానికి మహలక్ష్మి చేసిన ప్రయత్నాలేవీ ఫలించ లేదు. అందుచేత ఆమె అతనిలో దైవభక్తి ప్రేరేపించి తెలివితేటలు పెంపొందించే ఏర్పాటు చేసింది. భార్య ప్రేరేపణతో భీమన్న ప్రతి సాయంకాలమూ ఊరి బయట ఉండే గుడికి వెళ్ళి దేవుడికి దణ్ణం పెట్టుకుని ఇంటికి తిరిగి వచ్చేవాడు.

ఇలా ఉండగా ఒక మోసగాడు ఆ ఊరు చేరి, గుడి పక్కన ఉండే చెరువు దగ్గిర చెట్టు కింద ఒక మునిలాగా వేషం వేసుకుని కూచుని వచ్చేపోయే వాళ్ళద్వారా గ్రామ పరిస్థితులన్నీ గ్రహించసాగాడు.

ఈ మోసగాడు భీమన్నను గురించి కూడా తెలుసుకున్నాడు. భీమన్న జమీందారుగారి అల్లుడూ, అమాయికుడూనూ. అందుచేత ఒకనాటి సాయంకాలం భీమన్న గుడికి వెళుతూండగా మోసగాడు అతన్ని చూసి, "వస్తున్నావా, బిడ్డా, భీమన్నా! రా, రా!" అని పిలిచాడు.

మనిషి చూడబోతే మునీశ్వరుడులా గున్నాడు. తనను పేరు పెట్టికూడా పిలిచాడు; అందుచేత భీమన్నకు క్షణంలో ఆ మోసగాడి పైన భక్తి కుదిరింది. అతను మోసగాడి వద్దకు వెళ్ళి, సాష్టాంగ నమస్కారం చేసి లేచి, "ఏమి, స్వామీ?" అని అడిగాడు.

"బిడ్డా, నీవు దేవుడి దర్శనానికి ఆరాటపడుతున్నావని నేను గ్రహించాను. అందుకే రోజూ దేవాలయానికి పోయి వస్తున్నావు. నీ భక్తి చాలా గొప్పది, కాని దేవాలయంలో నీకు దేవుడి దర్శనం ఎలా అవుతుంది, నాయనా? ఆలయంలో ఉండేది దేవుడి విగ్రహమేగాని దేవుడుకాడే! నీకు దేవుళ్ళను ప్రత్యక్షంగా చూపుదామని పిలిచాను. నిజంగా దేవుళ్ళ దర్శనం చేసుకోవాలని

నీకున్నదా?'' అని మోసగాడు అడిగాడు.

"లేకపోవట మేమిటి, స్వామీ? ఆ దేవుళ్ళు ఎక్కడున్నారు? ఎలా కనిపిస్తారు?'' అని భీమన్న మోసగాణ్ణి అడిగాడు.

"అది నా చేతిలో ఉన్నదే, నాయనా! నేను రమ్మంటే వాళ్ళు వస్తారు. వారిని చూచినాక నీ సమస్త కోరికలూ తీరిపోతాయి. నీ జన్మ తరిస్తుంది. కాని నేను చెప్పినట్టుగా నీవు చేయాలి,'' అన్నాడు మోసగాడు.

"అలాగే చేస్తాను, స్వామీ,'' అన్నాడు భీమన్న భక్తిగా.

"అయితే విను. నీవు నీ చొక్కా విప్పి ఇక్కడ పెట్టు. నీ వంటి మీద ఉన్న ఉంగరాలూ, బంగారు మొలతాడు, మెడలో గొలుసూ అవీ తీసి చెరువులో దిగి మునిగి ఉండు. కొద్ది సేపట్లోనే దేవతలు నీకు కనిపిస్తారు,'' అన్నాడు మోసగాడు.

భీమన్న సరేనని తన ఒంటిపైన ఉండే నాలుగు సొమ్ములూ తీసి, చొక్కా విప్పి, అన్నిటినీ చెరువు గట్టుపై ఉంచి, నీటిలోకి దిగి మునిగి అలాగే ఉండిపోయాడు. భీమన్న నీటిలో మునిగిన మరుక్షణం మోసగాడు అతని చొక్కా, నగలూ పట్టుకుని గుడి దిక్కుగా పారిపోసాగాడు.

ఈలోపల నీటిలో మునిగిన భీమన్న కొక ఆలోచన వచ్చింది. అదేమిటంటే, తనకు



దేవతలు కనిపిస్తారుగాని ఆ దేవతలను తానొక్కడే చూస్తాడు; తన భార్య చూడదు. ఇది అన్యాయం. మునీశ్వరుడి ఆజ్ఞ పొంది మహలక్ష్మిని కూడా పిలుచుకు వచ్చే ఉద్దేశంతో భీమన్న నీటిలో నుంచి పైకి లేచేసరికి, పారిపోతున్న మునీశ్వరుడు కనిపించాడు.

"స్వామీ, స్వామీ! కొంచెం ఆగండి! ఒక్కమాట!" అని కేకలు పెడుతూ భీమన్న మోసగాడి వెంట పడ్డాడు. భీమన్న గొంతు విని మోసగాడు మరింత పిక్కబలం చూపాడు. అయితే భీమన్న బలశాలీ, దమ్ము గలవాడూ కావటంచేత త్వరలోనే మోస గాణ్ణి అందుకుని, పట్టుకుని, "మీరు దేవు ళ్ళను పిలుచుకు రావటానికి వెళుతున్నారు లాగుంది. అందుకు తొందర ఏమీలేదు. కొంచెం నిలవండి!" అన్నాడు.

మోసగాడికి గుండెదడ క్షణక్షణానికీ హెచ్చి పోతున్నది. వాడు తన చేతిలో ఉన్న భీమన్న చొక్కా, నగలూ కింద పారేసి, ఎట్లాగో భీమన్న పట్టు నుంచి తప్పించుకుని మళ్ళీ పరిగెత్తసాగాడు.

"స్వామీ, నా మాట వినకుండా ఎందుకు వెళ్ళిపోతున్నారు? ఇంతలోనే నాపై తమ కెందుకు కోపం వచ్చింది?" అంటూ భీమన్న మోసగాడి వెంట పడ్డాడు.

ఈ కేకలు విని గుడిలో వాళ్ళంతా బయటికి వచ్చి మోసగాడి దారికి అడ్డు తగిలారు. వాడు భీమన్నకు చిక్కనే చిక్కాడు. నలుగురూ చేరి వాడి పెట్టుడు గడ్డాలూ, మీసాలూ పీకేసి, వాడు దొంగ అని తేల్చారు. తీరా విచారించగా వాడు పెద్ద దొంగ అనీ, ఎన్నో గ్రామాలలో ఎందరినో మోసగించాడనీ తేలింది. అటు వంటి దొంగను జమీందారుగారి అల్లుడు గారు పట్టుకున్నాడని ఆ చుట్టుపక్కల చాలా ఏళ్ళపాటు గొప్పగా చెప్పుకున్నారు.

[పై మాసం మరొక సంఘటన]





# నాగకిరీటం

ఒకప్పుడు స్విజర్లాండులో ఒక రాజుండే వాడు. ఆయనకు ఒకతే కూతురు. కొడుకులు లేరు. ఎందరు దేవుళ్ళకు మొక్కుకున్నా ఆయనకు పుత్ర సంతానం కలగనే లేదు. అందుచేత ఆయన ఆ కూతురినే కొడు కనుకుని ఎంతో ప్రేమగా చూసుకుంటూ వచ్చాడు.

ఒకనాడు తండ్రి కూతుళ్ళు షికారు వెళుతూండగా ఒక ముసలిది ఒక పామును ముద్దులాడుతూ కనిపించింది. అది చూసి రాజుకూతురు, "ఛీ, ఛీ! ఎంత అసహ్యం!" అన్నది. ఈ మాట విని ముసలిది మండిపడి, అసహ్యంతో రాజకుమార్తెను ఎగాదిగా చూసి, "ఈ ప్రాణిని చూసి అంత ఏవగించుకున్నావు గనక నీవు కూడా దీని లాగే బ్రతుకు," అంటూ తన కుడి చేతిలో ఉన్న పుల్లతో రాజకుమార్తెను తాకింది. రాజు ముసలిదానికి అడ్డుపడే లోపల ఈ దారుణం జరిగిపోయింది. రాజకుమార్తె పాముగా మారి, తల ఎత్తి తండ్రి కేసి దీనంగా చూసింది. ముసలిది అంతటితో పోనివ్వక, "ఇంక నీకు తండ్రితో ఏం పని? వెళ్ళి పాములాగా జీవించు," అంటూ ఆ పామును మళ్ళీ పుల్లతో తాకింది. ఆ పాము చరచరా అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

అంతవరకూ కొయ్యబారి చూస్తూ నిలబడిపోయిన రాజు ఆగ్రహంతో కత్తి దూసి ముసలిదాన్ని చంపబోయాడు. అది భయపడక చేతిలోని పుల్ల పైకెత్తి, "జాగ్రత్త, నీ కూతురికి పట్టిన గతే నీకూ పట్ట గలదు," అని బెదిరించింది.

జుట్టు అందకపోయే సరికి రాజు కాళ్ళ బేరానికి వచ్చి, ముసలిదాన్ని కనికరించమని శత విధాల వేడుకున్నాడు. "నాకు మంత్రాలు వేయటం చాతనవును గాని మంత్రాలు విప్పటం చాతకాదు. నా చేతిలో

స్విజర్లాండ్ జానపద కథ



ఉన్న దేమిటంటే నీ కూతురిని నాగులకు రాణి చెయ్యగలను. అప్పు డామె జీవితం ఒక్క పిసరు మెరుగుగా ఉంటుంది. ఆమె కోసం ఒక బుల్లి కిరీటం చేయించి మూడు రోజుల తరవాత ఇక్కడికే తీసుకువచ్చి నా కియ్యి. నీ కూతురు ఆ కిరీటం కరిగి పోయేదాకా పాముగా ఉండి, ఆ తరవాత మానవరూపు పొందుతుంది. మేలిమి బంగా రంతో కిరీటం చేయించు. కలితీ బంగారం నీటిలో ఎప్పటికీ కరగదు," అన్నది మంత్రాల ముసలిది.

రాజు ఒక్క నిట్టూర్పు విడిచి ఇంటికి వెళ్ళి బుల్లి కిరీటం చేయించి తెచ్చి ముసలి దానికి ఇచ్చాడు. అది రాజకుమార్తెకు చేరింది. త్వరలోనే ఆ కిరీటం మహత్తు అందరికీ తెలిసిపోయింది. అది ఉన్న చోట లేమి ఉండదు. ధాన్యం గాదెలో దాన్ని ఉంచితే గాదె నుంచి తరగకుండా ధాన్యం తీసుకోవచ్చు. డబ్బు మధ్య దానినుంచితే ఆ డబ్బు తరగదు. అందుచేత ఆ కిరీటాన్ని ఎలాగైనా సంపాదించాలని చాలామంది ప్రయత్నించారు.

ఒకనా డొక పేద రైతు అరణ్యంలో ప్రయాణం చేసి వస్తూ, దాహం అయి, ఒక కొలనులో మంచినీరు తాగటానికి ఆగాడు. నీటిలో అతని కొక పెద్ద పాము ఈదుతూ కనిపించింది. కొలను ఒడ్డున అతనికి ఒక బుల్లి కిరీటం ధగధగా మెరుస్తూ కనిపించింది. అదే నాగకిరీటమై ఉంటుం దని ఊహించి ఆ రైతు దాన్ని తీసుకుని తన దారిని బయలుదేరాడు. త్వరలోనే ఆ పెద్ద పామూ, మరి కొన్ని ఇతర పాములూ తన వెంట పడటం గమనించి ఆ రైతు చప్పున సమీపంలో ఉన్న పెద్ద చెట్టు మీదికి ఎగబాకాడు.

వాడు చెట్టు దిగి రావటానికి లేకుండా పాములు చెట్టుమొదట్లో బుసలు కొడుతూ అటూ ఇటూ కారాడాయి.

ఇంతలో ఎవరో స్త్రీ అటుగా వచ్చి వాణ్ణి చూసి, "ఎందుకు చెట్టెక్కావు, బాబూ?" అని అడిగింది. వాడు జరిగిన సంగతంతా ఆ స్త్రీకి చెప్పి, "నిన్ను పాములు ఏమీ చెయ్యక పోవటాని కేమిటి కారణం?" అని అడిగాడు. "నాకు పాముమంత్రం వచ్చు. పాములు నన్నేమీ చెయ్యవు. నాకా నాగకిరీటం ఇస్తే ఈ పాములన్నిటినీ పంపేస్తాను. నీ ప్రాణాలు కాపాడుకో వచ్చు," అన్నది ఆ ఆడమనిషి.

"ఆ సంగతి తరవాత చూస్తాం. ముందు పాముల్ని పంపెయ్యి," అన్నాడు రైతు. ఆడది ఏదో మంత్రం చదివే సరికి పాములు తమ దారిన వెళ్ళిపోయాయి. తరవాత రైతు చెట్టు దిగివచ్చి, "నేను సంసార భారం మోసేవాణ్ణి. నాకు ఈ కిరీటం చాలా ఉపయోగిస్తుంది. కావలిస్తే నీవు కూడా నీ వాళ్ళతో వచ్చి నా ఇంటనే ఉండు. నీకే లోటూ రాకుండా చూస్తాను," అన్నాడు. విధిలేక ఆ ఆడది ఒప్పుకున్నది. ఆమె ఒంటరి మనిషి.

రైతు నాగకిరీటాన్ని తెలివిగా ఉపయోగించుకుంటూ ధనధాన్యాలతో చాలా కాలం తులతూగాడు. ఆ ఆడమనిషికి నాగకిరీటం ఎక్కడ ఉన్నదీ తెలియలేదు. చివరకామె ఆ రహస్యం కనిపెట్టి, రైతు ఇంట లేనప్పుడు



దాన్ని తీసుకుని తన ఇంటికి పారిపోయింది. ఆమె ఇల్లెక్కడో రైతుకు తెలియదు.

ఇప్పుడు అదృష్టం ఆ ఆడమనిషికి పట్టుకున్నది. ఆమె నాగకిరీటాన్ని తన ధాన్యపు గాదెలో ఉంచి తరగని ధాన్యంతో చాలా డబ్బు సంపాదించుకున్నది. కాని ఒకనాడు ఆమె ధాన్యాన్ని పిండిమరకు పంపటంలో నాగకిరీటం కూడా ధాన్యంతో పాటు మరకు వెళ్ళిపోయింది.

ఆ ధాన్యాన్ని మరలో పోసి మర యజమాని ఆడించటం మొదలుపెడితే ఎంత సేపు గడిచినా పిండి తయారవుతూనే ఉంది. ఇందులో ఏదో విపరీతం ఉన్నదనుకుని ధాన్యం అరలో వెతకగా నాగకిరీటం దొరికింది. మరవాడు దాన్ని తీసుకుపోయి తన గల్లాపెట్టెలో దాచాడు. ఇంతలో ఆడది వచ్చి తన నగ ధాన్యంతో బాటు మరకు వచ్చిందని తగూలాడింది. తన కేమీ తెలియదన్నాడు మరవాడు. ఆడది మర అంతటా వెతికి నాగకిరీటం దొరక్క, నిరాశ చెంది వెళ్ళిపోయింది.

మరవాడికి ఒక గొప్ప ఆలోచన తట్టింది. నాగకిరీటాన్ని ధాన్యపు అరలోనే ఉంచేస్తే కొద్ది ధాన్యాన్ని ఏళ్ళతరబడి ఆడి అంతు లేని పిండి పట్టి, దాన్ని అమ్మి అంతులేని డబ్బు సంపాదించవచ్చు. కొంత కాలం పాటు మరవాడు ఇలాగే డబ్బు చేసుకున్నాడు. అయితే ఒకనాడు ప్రమాదం జరిగిపోయింది. నాగకిరీటం ధాన్యంతోబాటు తిరగలిరాళ్ళ మధ్యకు పోయి పొడి పొడి అయిపోయింది.

మరలో ధాన్యం కాస్తా అడుగంటాయి. పిండి నిలిచిపోయింది.

నాగకిరీటం నిర్మూలమైన క్షణంలోనే నాగరాణిగా జీవిస్తూ ఉండిన రాజకుమార్తెకు ఎప్పటి రూపం వచ్చేసింది. ఆమె తన తండ్రిని చేరుకుని, తగిన వరుణ్ణి పెళ్ళాడి సుఖంగా ఉన్నది.





# అరణ్యకాండ

తరవాత రావణుడు అంతఃపురం నుంచి బయటికి వచ్చి జట్టీలలాటి ఎనిమిదిమంది రాక్షసులను పిలిచి, "మీరు అన్ని రకాల ఆయుధాలూ పట్టుకుని జనస్థానానికి వెళ్ళాలి. ఒకప్పు డక్కడ ఖరుడుండేవాడు. అక్కడి రాక్షసులంతా చావటం చేత ఇప్పు డెవరూ లేరు. ఖర దూషణులనూ, రాక్షస సేననూ రాముడు చంపేశాడు. ఆ రాముడికీ మనకూ మధ్య ఇప్పుడు గొప్ప వైరం ఏర్పడింది. అందుచేత ఆ రాముణ్ణి చంపేదాకా నేను నిద్రపోను. ఈ లోపుగా మీరేం చెయ్యాలంటే, ఆ జనస్థానంలో ఉండి, రాముడు ఎప్పుడేం చేసేదీ నాకు ఎప్పటికప్పుడు తెలుపుతూ ఉండాలి. మీరు ఒక్క క్షణం కూడా ఏమరుపాటన్నది లేకుండా, రాముణ్ణి చంపే ప్రయత్నంలోనే ఉండాలి. మీ బల పరాక్రమాలు నేను అనేక పర్యాయాలు చూశాను గనక మీ కీ పని ఇస్తున్నాను," అని చెప్పాడు.

రాక్షసులు వెళ్ళిపోయారు. తరవాత రావణుడి బుద్ధి సీత మీదికి వెళ్ళింది. అతను త్వరగా తన అంతఃపురానికి తిరిగి వచ్చి, రాక్షసస్త్రీల మధ్య కూచుని దుఃఖ సముద్రంలో మునిగి ఉన్న సీతను చూశాడు. సీత వద్దు మొర్రో అంటున్నా వినకుండా అతను సీతను బలవంతంగా తీసుకుపోయి తన భవనమంతా చూపించాడు. అది దేవతాగృహాలలాటిది. అందులో అనేకవేల మంది స్త్రీ లున్నారు. రకరకాల పక్షులున్నాయి. ఎక్కడ చూసినా రత్నాలూ,



దంతంతో చేసిన భాగాలూ, స్ఫటికశిలలూ, వెండితో చేసినవీ, వజ్రవైడూర్యాలు తాపడం చేసిన అందమైన స్తంభాలు ఉన్నాయి. బంగారు ద్వారం గల అద్భుతమైన మెట్ల వరస మీదుగా ఇద్దరూ ఎక్కారు. మెట్ల పక్కన వెండి కిటికీలూ, దంతపు కిటికీలూ ఉన్నాయి. మేడ మీద బంగారు కిటికీలున్నాయి. కొన్నిచోట్ల గోడలో రత్నాలు పొదిగారు. తన ఐశ్వర్యంతో సీతను భ్రమింప జెయ్యటానికిగాను రావణుడు ఇవన్నీ సీతకు చూపాడు.

అతను సీతతో, "నీవు నాకు ప్రాణం కన్న ఎక్కువైన దానివి. నా భార్యవయావో నా మిగతా భార్యలందరికీ రాణిని చేస్తాను. ఈ మహానగరం దేవతలకు కూడా గెలవ రానిది. నిన్ను ఇక్కడి నుంచి తీసుకు పోగలవాడు మూడు లోకాలలోనూ లేడు. నన్ను కూడా దాసుడుగా చేసుకుని ఈ లంకా రాజ్యాన్ని నీవే ఏలు. ఎప్పుడో ఏదో పాపం చేసి వనవాసం అనుభవించావు. ఇక నీ పుణ్యం అనుభవించు. విమానంలో మనం ఇష్టం వచ్చినట్టు విహరింతాం. దుఃఖిస్తుంటే నీ అందమైన ముఖం కళారహితంగా ఉన్నది. అందుచేత విచారం మాను!" అన్నాడు.

ఇంత చెప్పినా సీత చలించలేదు. ఆమె తనకూ రావణుడికీ మధ్య ఒక గడ్డిపోచ అడ్డంగా పట్టుకుని, అతని కేసి చూస్తూ, "నాకు ఒకడే దేవుడు. అతడు నా భర్త అయిన రాముడు. అతని చేతిలో నీకు చావు రాసిపెట్టి ఉన్నది. ఈ లంకకు వైధవ్యప్రాప్తి తప్పదు. నా శరీరాన్ని బంధించు, కోసుకుతిను గాక, నేను పాతివ్రత్య భంగం సహించను," అని జవాబిచ్చింది.

రావణుడు మండిపడి, "అయితే నా మాట విను. నీకు పన్నెండు మాసాలు గడు విచ్చాను. ఈ లోపుగా నీవు నా కోరి





కను అమోదించకపోతే నా వంటవాళ్ళచేత నిన్ను ముక్కలు ముక్కలుగా కోయించి ఫలహారం వండిస్తాను!" అన్నాడు.

తరవాత అతను రాక్షసస్త్రీలను పిలిచి, "ఈమెను అశోకవనానికి తీసుకుపోయి మీరంతా చుట్టూ ఉండి జాగ్రత్తగా రక్షించండి. నయానో భయానో ఈమెను దారికి తీసుకు రండి," అని ఆజ్ఞాపించాడు.

ఆ ప్రకారమే రాక్షసస్త్రీలు సీతను అశోకవనానికి తీసుకువెళ్లారు. ఆ వనంలోని చెట్లు ఎల్లప్పుడూ పూలతోనూ, పళ్ళతోనూ నిండి ఉంటాయి. వనం నిండా పక్షులున్నాయి. రాక్షసస్త్రీలు సీతను అక్కడికి చేర్చి చుట్టూ కూచున్నారు. అమెకు దుఃఖమూ, భయమూ పట్టుకున్నాయి. అమె రాముణ్ణి తల్చుకుని దుఃఖం పట్టలేక మూర్ఛపోయింది.

అక్కడ రాముడు మాయలేడి రూపంలో వచ్చిన మారీచుణ్ణి చంపి ఆశ్రమానికి తిరిగి వస్తూండగా వెనక నుంచి నక్క ఒకటి కూసింది. ఈ దుశ్శకునంతో కలవరపడి రాముడు, "సీతను ఏ రాక్షసులో తిని ఉండరు గద!" అని భయపడ్డాడు. లేడి రూపంలో ఒక రాక్షసుడు వచ్చి తనను ఆశ్రమానికి దూరంగా తీసుకుపోవటమూ, చస్తూ కూడా వాడు తన గొంతుతో ఆర్తనాదం చెయ్యటమూ చూస్తే తన కేదో ద్రోహం తలపెట్టి రాక్షసులు పన్నాగం చేశారని అతనికి నమ్మకం కలిగింది. సీతకు లక్ష్మణుడు రక్షగా ఉన్నాడన్న ధైర్యం అవలంబించేటందుకు కూడా అవకాశం లేకుండా ఆ లక్ష్మణుడే తనకు ఎదురు వస్తూ కనిపించాడు!

రాముడి ఆందోళన రెట్టింపయింది. అతను లక్ష్మణుడి చెయ్యి పట్టుకుని, "ఇదేమిటి, లక్ష్మణా? సీతను ఆశ్రమంలో ఒంటిగా విడిచి వచ్చావా? సీతను మళ్ళీ మనం ప్రాణాలతో చూస్తామా? సీతకు ఏమన్నా జరిగిందో నా ప్రాణాలు నిలవవు!

నేనుపోయాక నీవు అయోధ్యకు తిరిగిపోతే, కైకేయి తన కోరిక పూర్తిగా ఫలించినందుకు సంతోషిస్తుంది కాబోలు! ఆ రాక్షసుడి కేకకు శూరుడవైన నీవు కూడా భయపడ్డావా? నేను ఖరదూషణాది రాక్షసులను చంపానేమో, వారు పగపట్టి ఉన్నారు; సీతను తప్పక చంపేస్తారు. లక్ష్మణా, నాకు అపశకునాలు కనిపిస్తున్నాయి. దుఃఖంలో మునిగి ఏమీ చేయలేని స్థితిలో పడ్డాను," అన్నాడు.

లక్ష్మణుడు సీత అన్న కఠోరవచనాలు వివరించి చెప్పి, ఆ పరుషాలు సహించలేక బయలుదేరి వచ్చానన్నాడు.

"సీత అజ్ఞానం చేత ఏవేవో అన్నదని ఆగ్రహించి నీవు నా ఆజ్ఞను ఉల్లంఘించటం చాలా తప్పు! నా కే ప్రమాదమూ రాదని తెలిసిన వాడవు సీత వెంటనే ఉండవలిసింది," అన్నాడు రాముడు.

రాముడు భయపడ్డంతా అయింది. సీత పర్ణశాలలో లేదు. ఆమె మామూలుగా తిరిగేచోట్లలో కూడా లేదు. ఆశ్రమం బావురుమంటున్నది. అతనికి దుఃఖం ముంచుకు వచ్చింది. అతను సీత కోసం వెతుకుతూ అడవిన పడ్డాడు. "సీత ఎక్కడ ఉన్నది?" అని అరణ్యవృక్షాలను పేరుపేరునా అడిగాడు. దుఃఖాతిశయంతో అతనికి మతి



పోయింది. అంత దూరాన సీత కనిపించి నట్టూ, తనకు అందకుండా పారిపోతు న్నట్టూ, భ్రమ కలిగింది; సీతను కేకపెట్టి పిలిచాడు. ఉన్నట్టుండి అతనికి సీత ఎక్కడో దాక్కుని తనను ఏడిపిస్తున్నదన్న అనుమానం వచ్చింది; కనిపించమని ఆమెను వేడుకున్నాడు.

లక్ష్మణుడు రాముడి దీనస్థితి గమనించి, "అన్నా, దుఃఖించి లాభంలేదు. చుట్టు పక్కల అరణ్యమంతా వెతుకుదాం. సీత ఎంతోదూరం వెళ్ళి ఉండకపోవచ్చు," అని ధైర్యం చెప్పాడు. పరిసరారణ్యమంతా వెతికినా వారికి సీత జాడ తెలియలేదు. రాముడికి మళ్ళీ అధైర్యం పట్టుకున్నది; అతని దేహంలో శక్తి లేకుండా పోయింది. అతను నిస్త్రాణగా కూలబడిపోయాడు.

అన్న సీతను తలుచుకుని పెద్దపెట్టున శోకాలు పెట్టుతూండటం చూసి లక్ష్మణుడు అతన్ని ఓదార్చటానికి ఎంతగానో ప్రయత్నించాడు. కాని ఆ మాట లేవీ రాముడి చెవి కెక్కలేదు. అతను లక్ష్మణుడితో, "సీతను రాక్షసుల పాలుకా నిచ్చిన నన్ను లోకం నిర్వీర్యుడి కింద జమ కడుతుంది. సీత లేకుండా నేను అయోధ్య కెలా వెళతాను, సీత లేని శూన్యాంతఃపురంలో ఎలా ప్రవేశిస్తాను? నేను వచ్చానని తెలిసి జనక





మహారాజు వస్తే ఆయనకు నా ముఖం ఎలా చూపిస్తాను? సీత లేక నేను బతికే మాట అబద్ధం. అందుచేత నన్నిక్కడే వదిలి నీవు అయోధ్యకు వెళ్ళు. భరతుణ్ణే రాజ్యం పాలించమన్నానని చెప్పు. నేను సీతా ఎలా నాశనమయామో మా తల్లికి చెప్పు," అన్నాడు. రాముడు స్థితి చూసి లక్ష్మణుడు చాలా బాధపడ్డాడు.

చివరకు లక్ష్మణుడి ప్రోత్సాహంతో రాముడు సీతను మరింత ఓపికగా వెతకటానికి నిశ్చయించాడు. ఒకచోట వారికి సీత ధరించిన పూలు నేలపై కనిపించాయి; వాటిని రాముడు గుర్తించాడు. మరికొంత దూరాన రాక్షసుడి అడుగులూ, సీత అడుగులూ కనిపించాయి; అక్కడనే సీత రావణుడికి అందకుండా పారిపోవ యత్నించింది. ఆ ప్రాంతంలోనే రక్తపు మరకలూ, విరిగిపోయిన రథమూ, గొడుగూ, గాడిదలూ, సారథి కళేబరమూ, బంగారు విల్లూ మొదలైనవి కనిపించాయి. ఆ రక్తం సీతదే ననుకున్నాడు రాముడు.

అప్పటివరకూ రాముడికి రాక్షసులపైన ప్రత్యేకించి పగలేదు; కాని ఆ క్షణంలో రాక్షసనిర్మూలనం చెయ్యాలనే నిశ్చయం అతనిలో ఏర్పడింది. "నా సీతను నాకు వెంటనే ఇవ్వకపోతే మూడు లోకాలనూ ఒక్క బాణంతో భస్మీపటలం చేస్తాను," అని రౌద్రంగా అన్నాడు.

లక్ష్మణుడు రాముణ్ణి వారిస్తూ, "ఈ యుద్ధం జరిగినచోట ఒక్క మనిషి అడుగుజాడలే ఉన్నాయి. ఒక్కడు చేసిన తప్పుకు మూడు లోకాలను శిక్షించటం అన్యాయం. ఎవడు సీతను అపహరించాడో వాడి కోసం అన్నిచోట్లా వెతుకుదాం," అన్నాడు.

ఇంతలోనే వారికి చావ సిద్ధంగా ఉన్న జటాయువు శరీరం ఎత్తుగా కనిపించింది. "ఇదుగో, వీడే సీతను తినేసి హాయిగా కూచున్నాడు! వీడి ప్రాణాలు తీసేస్తాను,"

అంటూ రాముడు జటాయువుపై బాణం ఎక్కుపెట్టాడు.

"నాయనా, నన్ను రావణుడు చంపనే చంపాడు. నీవు మళ్ళీ ఎందుకు చంపుతావు? వాడు సీతను ఎత్తుకుపోతుంటే అడ్డుపడి వాడి వింటినీ, రథాన్నీ, గాడిదలనూ, సారథినీ ధ్వంసం చేశాను. వాడు కత్తితో నా రెక్కలు నరికేశాడు. తరవాత సీతను తీసుకుని ఆకాశమార్గాన వెళ్ళిపోయాడు," అని జటాయువు చెప్పాడు.

ఈ మాటలు రాముడి చెవులకు శుభవార్తలాగా వినిపించాయి. ఎందుకంటే సీతను రాక్షసులు చంపి తినలేదు; ఆమెను ఎత్తుకుపోయిన వాడెవడో కూడా తెలిసింది. రాముడు తన విల్లును వదిలిపెట్టి జటాయువును కౌగలించుకుని దుఃఖించాడు. అతను జటాయువును, "రావణుడికి నేనేమి అపకారం చేశాను? సీతనెందుకు అపహరించాడు? అత నుండే చోటేది? అతను ఎలా ఉంటాడు? ఎలాటి పరాక్రమం కలవాడు? వాడు తీసుకుపోతూ ఉంటే సీత ఏ స్థితిలో ఉన్నది? ఏమి చెప్పమన్నది? నీకు శక్తి ఉన్నట్టయితే నాకు సమస్తమూ సవిస్తరంగా చెప్పు," అని అడిగాడు.

కొనప్రాణాలతో ఉన్న జటాయువు, "ఆ రావణుడు ఇలా దక్షిణంగా వెళ్ళాడు. వాడు కుబేరుడి తమ్ముడు," అని మాత్రం చెప్పి ప్రాణాలు వదిలాడు. ఎంతో కాలం గొప్పగా జీవించి తన కోసం ప్రాణాలర్పించిన జటాయువుకు రాముడు శాస్త్రోక్తంగా అంత్యక్రియలు జరిపాడు, పిండప్రదానానికి కేసరీ మృగమాంసం సంపాదించాడు. అనంతరం రామలక్ష్మణులు గోదావరిలో స్నానాలు చేసి జటాయువుకు జలతర్పణాలు వదిలారు. తరవాత వారిద్దరూ జటాయువు చెప్పిన ప్రకారం సీతను వెతుకుతూ బయలుదేరారు.



# 15. "పెట్రా" — శిలానగరం

ఈనాటి జోర్డాన్ దేశంలో "డెడ్ సీ"కి దక్షిణంగా ఒక పురాతన శిలానగరం ఉన్నది. రెండు వేల ఏళ్ళనాటి ఈ నగరాన్ని నబాతియనులు పాలించేవారు. క్రీస్తుశకం 105 లో ట్రాజన్ అనే రోమను చక్రవర్తి నబాతియనులను ఓడించి ఈ నగరాన్ని రోమను సామ్రాజ్యంలో చేర్చాడు.

అనేకవందల సంవత్సరాలపాటు అజ్ఞాతంగా ఉండి కిందటి శతాబ్దంలో పాశ్చాత్య పరిశోధకుల చేత కనిపెట్టబడిన ఈ శిలానగరం పూర్తిగా కొండలలో మలచబడింది. ఇందులో రాజభవనాలూ, వ్యాపారసరుకుల ఖజానాలూ, సమాధులూ, ఆలయాలూ, సామాన్య కుటుంబాలుండే గుహలూ ఉన్నాయి. ఒకప్పుడు వ్యాపారంతో తులతూగుతూ, వేల జనాభా గల ఈ నగరంలో ఈనాడు కొద్దిమంది "బిదావిన్" తెగవారుంటున్నారు.

ఈ ప్రాచీననగరం అజ్ఞాతంగా ఉండటానికి ప్రధాన కారణం దీనిచుట్టూ కొండలుండటమే. ఈ నగరంలోకి పోయేటందుకు ఒక ఇరుకైన కనుమ మాత్రమే ఉన్నది. దాని నిడివి ఒక మైలు. దాని కిరువైపులా అనేక వందల అడుగుల ఎత్తుగల కొండ ఉన్నది.






1. *ఈర్ని కామేశ్వరరావు, రాజమండ్రి*

జనవరి సంచికలో సీతాదేవి రత్నహారాలు, పట్టుచీర ధరించినట్టుగా వ్రాసి నారు. కాని సీతాదేవి అయోధ్య నుండి అరణ్యములకు వెళ్ళేటప్పుడు నార బట్టలు ధరించి, ఏ విధమైన ఆభరణాలు ధరించనట్లు మా తాతయ్యగారు చెప్పారు.

కైకేయి సీత కోసం నారచీర .తెచ్చినప్పుడు దశరథుడు అభ్యంతరం చెప్పటమేగాక, సీతకు పధ్నాలుగేళ్ళపాటు సరిపోయే పట్టుబట్టలూ, నగలూ కూడా ఇప్పించాడు. సీతకు నగలు లేవని మీ తాతగారు చెప్పి ఉండరు. నగలు లేకపోతే సీత మూట గట్టి ఋశ్యమూక పర్వతం పైన ఏమి పారేసింది? ఇంకా చాలా మంది పాఠకులు చాలా చాలా అనుమానాలు అడుగుతున్నారు. సీతను రావణుడు తాకనే లేదనీ, మట్టి పెళ్ళతో సహా పెళ్ళగించాడనీ, లక్ష్మణుడు సీతను విడిచి వెళ్ళేటప్పుడు గిరులు గీశాడనీ, సీత వాటిని దాటి వచ్చాకనే రావణుడు ఎత్తుకు పోగలిగాడనీ, మేము రామాయణంలో లేని విషయాలు కల్పిస్తున్నామనీ రకరకాలుగా అంటున్నారు. వారు విన్న వివరాలన్నీ ఏదో ఒక రామాయణంలో విన్నవే, కాని వాల్మీకి రాసినవి కావు. రామాయణ కథ అనేక విధాలుగా ఉండి, వాల్మీకి రామాయణం మూలు పడిపోవటం చేతనే మేము వాల్మీకి రామాయణాన్ని అనుసరించి రాస్తున్నాము. రామాయణంలో వాల్మీకి ఏమి రాశాడో కూడా తెలియనివారు వాల్మీకి రామాయణం చదివినట్టు నటించ వద్దని మా మనవి. రావణుడు సీతను పట్టుకున్న ఘట్టంలో గల శ్లోకం ఇది:

> "జగ్రాహ రావణ స్సీతాం, బుధః ఖే రోహిణీ మివ,
> వామేన సీతాం పద్మాక్షీం మూర్ధజేషు కరేణ నః"

2. *ఎం. రామకృష్ణారావు, ఆగిరపల్లి*

సూర్యునికీ భూమికీ 9 కోట్ల 30 లక్షల మైళ్ళ దూర మున్నదన్నారు. ఎట్లా, ఎవరు కనిపెట్టినారు?

సూర్యుడికి భూమికీ ఉండే దూరం 91,406,000 నుంచి 94,524,000 కు మారుతూ ఉంటుంది. భూమి ఒకప్పుడు సూర్యుడికి కొంచెం దగ్గిర అవుతూ,

మరొకప్పుడు కొంచెం దూరమవుతూ ఉంటుంది; ఎల్లప్పుడూ ఒకే దూరంలో లేదు. ఈ సంగతి శాస్త్రజ్ఞులు కనిపెట్టారు. ఇలాటి ప్రకృతి రహస్యాలు కనిపెట్టటానికి వారికి మార్గాలున్నాయి.

3. *కొండపల్లి రామారావు బి.యస్‌సి., అలమండ*

భూమికి వలె మెర్క్యూరీ (కుజ), వీనస్ (శుక్ర) మొదలగు గోళములకు కూడా "మాగ్నటిజం" (అయస్కాంత క్షేత్రం) వున్నదంటారా?

దాన్ని గురించే పరిశోధనలు జరగవలసి ఉన్నది. చంద్రుడిలో అయస్కాంత క్షేత్రం లేదంటున్నారు. శుక్రగ్రహం చుట్టూ రేడియేషన్ బెల్టులు లేవని అమెరికనులు చెబుతున్నారు. అంటే అయస్కాంతక్షేత్రం కూడా లేదేమో! కుజగ్రహం సంగతి త్వరలోనే రష్యనులు చెప్పవచ్చు.

4. *ఎన్. శ్రీరామమూర్తి, పుల్లేటికుర్రు*

జనవరి సంచిక ఆఖరు కవరు మీద వక స్త్రీ శంఖ ధ్యానము చేయుచున్నట్లు వేసినారు. ఇది కేవలము అశాస్త్రీయమని నా భావము.

స్త్రీలు శంఖం ఊదరాదని ఎక్కడ ఉన్నదో మాకు తెలియదు. దక్షిణ కన్నడ ప్రాంతంలో స్త్రీలు శంఖా లూదుతారు. బెంగాలులో కూడా ఇలాటి ఆచారం ఉన్నట్టు జ్ఞాపకం. కాకపోయినా మీరు చెప్పే బొమ్మ భరతమాత. భరతమాతకు కూడా మామూలు స్త్రీల కుండే నిషేధాలు అంట గట్టటం అన్యాయం! మామూలు స్త్రీలకే ఉన్న నిషేధాలు తొలగాలనుకుంటున్నాం కద.

5. *స్వర్గం జనార్దన్, కొత్తపల్లి*

అన్నయ్యా, భూమియొక్క అక్షము వంగి యుండనిచో ఏమగును?

ఏడాది పొడుగునా ఒక్కొక్క ప్రాంతానికి ఒకే ఋతు వుంటుంది. ధృవప్రాంతాలలో ఎప్పుడూ సంధ్యాకాంతి మాత్రమే ఉంటుంది. భూమధ్యరేఖపై ఎప్పుడూ వేసవి కాలమే ఉంటుంది. ఉత్తర దక్షిణాయనా లుండవు; ప్రతిరోజూ సూర్యుడు దిఙ్మండలం మీద ఒకేచోట ఉదయించి ఒకేచోట అస్తమించుతూ ఉంటాడు.

6. *ఎల్. సత్యం, విల్లివాకం*

ఏమిటి, మామయ్యా! నీవు ప్రతి నెల చాలా అలస్యముగా బయలుదేరి వచ్చుచున్నావు? మిగతా భాషలలో త్వరగా వెలువడు చున్నది. తెలుగు మాత్రం ఆలస్యము. కారణం తెలిపెదవా?

తెలుగు సంచిక తయారయేసరికి అన్ని బ్లాకులూ సిద్ధంగా ఉంటాయి. టింట్లుకూడా అచ్చయి ఉంటాయి. అందుచేత ఇతర భాషల చందమామలు ఆలస్యం కావు. తెలుగు ఆలస్యం కావటం మాకు కూడా బాధగానే ఉన్నది.

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

నీ ముక్కు కోటేరైతే

పంపినవారు:
కె. కోటేశ్వరరావు, చేబ్రోలు

## మేలుచేసిన కీడు ★

[రామతీర్థ కథ]

ఒక పెద్ద మనిషి నిద్ర పోతూండగా ఒక పీడ కల వచ్చింది. ఆ కలలో అతను దొంగతనం చేసి పోలీసులకు దొరికి పోయాడు. అతను లాయర్ల చుట్టూ తిరిగాడు, కోర్టుల చుట్టూ తిరిగాడు. ఫలితం లేకపోయింది. ఉన్న డబ్బంతా పోయింది. సహాయం చెయ్యమని మిత్రులను వేడుకున్నాడు. తనను కాపాడమని ఎక్కడెక్కడి దేవుళ్లకూ మొక్కుకున్నాడు. ఏమీ లాభం లేకపోయింది. అతన్ని జైల్లో పడేశారు. చేసేదిలేక వలవలా ఏడ్చాడు. అతను ఇలాటి దురవస్థలో ఉండగా, గోరుచుట్టు మీద రోకటి పోటన్నట్టు, ఎటునుంచో వచ్చి ఒక పాము అతన్ని కాటేసింది. విపరీతమైన భయమూ, బాధా కలిగాయి. అతను కెవ్వుమని పెద్దగా అరిచి నిలువెల్లా కంపించిపోతూ నిద్ర మేలుకున్నాడు.

అంతా కల. తనకే ఆపదా జరగలేదు. తాను తన ఇంటనే వున్నాడు. తన వాళ్లంతా తన చుట్టూ వున్నారు. అతని మనసు ఆనందంతో నిండిపోయింది. పాము కాటు అతనికి పీడ కల నుంచి విముక్తి కలిగించి, దుఃఖం పోగొట్టింది!



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1963 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఫిబ్రవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: నీ ముక్కు కోటరైతే

రెండవ ఫోటో: నా తోక బుడమేరు

పంపినవారు: కొనగళ్ల కోటేశ్వరరావు,

చేబ్రోలు, గుంటూరు జిల్లా

బహుమతి మొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# భారతం

కృష్ణాదులు ద్వారకకు తిరిగి వచ్చే సమయానికి అక్కడ రైవతక మహోత్సవం కోలాహలంగా జరుగుతున్నది. స్త్రీ పురుషులు బాగా తిని, తాగి ఉత్సాహంతో పాడుతున్నారు, ఆడుతున్నారు. ఎక్కడ చూసినా పరమానందంగా ఉన్నది.

కృష్ణుడు ఇంటికి వెళ్ళి తన తల్లి దండ్రులకు నమస్కారం చేశాడు. అతన్ని చూడటానికి యాదవులంతా వచ్చారు. అంతా కూర్చుని ఉండగా వసుదేవుడు కృష్ణుణ్ణి యుద్ధ వార్తలడిగాడు. కృష్ణుడు కావాలనే అభిమన్యుడి చావు వివరాలు వదిలేసి మిగిలిన విషయాలన్నీ తండ్రికి తెలిపాడు. అంతా వింటున్న సుభద్ర, "అన్నా, అన్నీ చెప్పి అభిమన్యుడి చావు ఎందుకు చెప్పవు?" అంటూ దుఃఖాతిశయంతో కుప్పగా కూలి పోయింది. కృష్ణుడి నోట అభిమన్యుడి చావు గురించి విన్నాక వసుదేవుడు కూడా శోక సముద్రంలో మునిగి పోయాడు. కృష్ణు డాయనను తగిన విధంగా ఓదార్చాడు. అనంతరం వసుదేవుడూ, బలరామ కృష్ణ సాత్యకులూ అభిమన్యుడి కోసం తర్పణాలు వదిలి బ్రాహ్మణులకు సువర్ణ వస్త్ర గోదానా లిచ్చారు, సంతర్పణలు చేశారు.

అక్కడ హస్తినాపురంలో కూడా అభిమన్యుడి చావు నుంచి ఎవరూ తేరుకోలేదు. చిన్న పిల్ల ఉత్తర కొన్నిరోజులు ఆహారమే ముట్టలేదు. ఆమె గర్భవతిగా కూడా ఉన్నదేమో అందరూ ఆమె దుఃఖానికి విచారించారు. వ్యాసుడు వచ్చి కుంతినీ, ఉత్తరనూ, అర్జునుణ్ణీ పరామర్శించి; అశ్వమేధం చెయ్యమని ధర్మరాజును హెచ్చరించాడు.

ధర్మరాజు అశ్వమేధం చెయ్యాలంటే ధనం కావాలి. మరుత్తు తాలూకు ధనం హిమాలయాలలో ఉన్నది. దానిని తీసుకురావాలి. అలా చెయ్యటం గురించి ధర్మరాజు భీముణ్ణి సలహా అడిగాడు. "శివుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకుని ఆ ధనం తెచ్చుకుందాం. శివుడు ప్రసన్నుడైతే గాని ఆ ధనాన్ని రక్షించే కిన్నరులు ప్రసన్నులు కారు," అన్నాడు భీముడు. మిగిలిన పాండవులు కూడా అలాగే అన్నారు.

ఒక మంచి రోజున బ్రాహ్మణాశీర్వచనాలు పొంది ధర్మరాజు హిమాలయాలకు బయలు దేరాడు. రాజ్యాన్ని యుయుత్సుడికి అప్పగించి, ధృతరాష్ట్ర గాంధారీ కుంతీల వద్ద సెలవు పుచ్చుకుని పంచపాండవులు బయలుదేరారు. వారి వెంట పెద్ద సేన కూడా వెళ్ళింది. వారు అనేక నదులూ, పర్వతాలూ గడిచి హిమాలయాలు చేరి, మరుత్తుడు ధనరాశి వుంచిన చోట విడుదులు ఏర్పాటు చేసుకున్నారు. తరవాత పాండవులు బ్రాహ్మణుల సలహాపై ఆ రాత్రి ఉపవాసం వుండి, దర్భచాపల పైన నిద్రపోయారు.

మర్నాడు ధర్మరాజు శివుడికీ, ప్రమథగణాలకూ విందు చేసి పూజించి, ఆయన ద్వారా లభించిన ధనాన్ని అనేక వేల ఒంటెల మీదా, గుర్రాల మీదా, ఏనుగుల మీదా, బళ్ళ మీదా, మనుషులతోనూ మోయించుకుని హస్తినాపురానికి బయలుదేరాడు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



ఆరోగ్య సుఖపూరిత
కుటుంబంలో సహచారి

ధూతపాపేశ్వర్

# శ్యామలా

ఆయుర్వేదీయ అభినవ సంయుక్త కల్ప





ధూత్‌పాపేశ్వర్
ఇండస్ట్రీస్
లిమిటెడ్
పన్వెల్-బొంబాయి







పెప్స్
లోక ప్రసిద్ధయిన
గొంతు
మరియు
గుండె
బిళ్లలతో
రొమ్ము పడిశెము

త్వరితంగా నివారించ బడినది

గొంతు నొప్పి, రొమ్ము పడిశెము దగ్గులు, ఆలుబులు, గొంతు మరియు గుండె బిళ్లలైన పెప్స్‌తో త్వరితంగా నివారణ యగును. పెప్స్‌ను చప్పరించి, నొప్పిని నివారించి క్రిములను నిర్మూలించే చర్యను జరుపునట్టి... అందరికి శమనకర ఆవిరులను ఆస్వాదించండి.




పెప్స్
గొంతు మరియు
గుండె బిళ్లలు

మందుల వ్యాపారు
లందరి వద్దనూ
దొరకును

సి. ఇ. ఫుల్‌ఫోర్డ్ (ఇండియా) ప్రైవేట్ లి.

FPY-56-TEL

సోల్ ఏజంట్లు :

దాధా & కంపెనీ,
86, నైనియప్ప నాయక్ వీధి,
మదరాసు - 3

## కాఫీ బోర్డు ఫిల్టర్‌తో
## పూర్తి సువాసనగల
## కాఫీ






కేంద్ర ఆహార విజ్ఞాన పరిశోధన సంస్థ రూపొందించిన నమూనా ప్రకారం తయారు చేయబడిన ఫిల్టర్. మీరు కాఫీని అతి తేలికగా తయారు చేసుకోడానికి వీలుగా—ప్రతిసారి అతిచక్కని కాఫీ అతి తక్కువ వ్యవధిలో మీరు తయారుచేసుకొనగలిగేటట్లు రూపొందించబడింది.

ఇదే జగ్ ఆకారంలో క్రింద వివరించబడిన రకాలు కలవు:-

| | | | |
|---|---|---|---|
| 4 కప్పులు పట్టేది— | ఇత్తడి (నికెల్ పూత) | ... | ధర రు. 25.35 |
| | స్టెయిన్‌లెస్ స్టీల్ | ... | ధర రు. 47.50 |
| 2 కప్పులు పట్టేది— | ఇత్తడి (నికెల్ పూత) | ... | ధర రు. 20.50 |
| | స్టెయిన్‌లెస్ స్టీల్ | ... | ధర రు. 31.50 |

పాకింగ్ ఖర్చులు అదనం

### ఫిల్టర్ ఉపయోగించడం ఎలా?

కప్పుకు ఒక కొలతగిన్నె చొప్పున కాఫీపొడర్ వేయాలి. (ఫిల్టర్‌తోపాటు ఈ కొలతగిన్నె కూడా ఇవ్వబడుతుంది.) ఇలా పోసిన కాఫీపొడిని సమతలంగా ఉండేట్లు సర్దాలి.



అప్పుడు బిళ్లను ఫిల్టర్‌లో పెట్టి బిళ్లతో కాఫీ పొడిని క్రిందకు తేలికగా నొక్కాలి. తర్వాత మసలుతున్న నీళ్లను బిళ్లపైన మెల్లగా పోయాలి.



అయిదు లేక ఏడు నిమిషాలలో కాఫీ తయారు అవుతుంది. దానిలో పాలు, పంచదార మీ రుచికి తగినట్టు కలపండి.



ఇండియా అంతటాగల
ఇండియా కాఫీ డిపోలలోను
కాఫీ హౌస్‌లలోను
ఈ ఫిల్టర్ లభించును.




కాఫీబోర్డు, బెంగుళూరు.



ఆహార లోటువల్ల

మీరు నీరసించిపోతున్నారా?

# ఆల్‌బో-సాంగ్ సేవించండి

దివ్యమైనది మరియు

సామాన్య పోషక. ఆహారమును పొదుపుగాను

వైజ్ఞానికంగాను బలపరచును.

టీ, కాఫీ, పాలు, గంజి, పళ్ల రసం మొదలైనవాటితో కలిపితే ప్రీతైన రుచిగలది. ఆల్‌బో-సాంగ్, శిశువులకు, ఎదిగే పిల్లలకు, చంటి బిడ్డ - తల్లులకు, మెదడునుపయోగించే పనివారికి, వృద్ధులకు, బలహీనతకు, రక్తహీనతకు మరియు రోగ విముక్తులై కోలుకుంటున్న వారికి, దివ్యమైనబలవర్ధక ఆహారము.




పౌడర్‌గాను, బిళ్లలుగాను

దొరుకు చున్నది.

**జె. అండ్ జె. డిషేన్**

హైదరాబాద్

జనవరి 14 న విడుదల

MAV PICTURES







ఎం ఏ వి పిక్చర్సువారి...

# ఎదురీత

దర్శకుడు
జి ఎస్ నారాయణ

నిర్మాత
ఎం ఏ వేణు



"రాజశ్రీ విడుదల"

# నిరాల సబ్బు

## ఉతుకు పనిని సులభము చేయును

సమృద్ధియగు
నురుగు ధర్మమా అని




## పొదుపు

ఎందుచేతననగా ఒకే ఒక్క
బారుతో ఎక్కువ బట్టలు ఉతుకవచ్చును.



## మేలురకము

అందులో శుభ్రముచేసే గుణము యెక్కువగానుండుటచే
తెల్లబట్టలు మరింత తెల్లగాను, రంగు బట్టలు
ప్రకాశవంతముగాను చేయును.






తుంగభద్రా ఇండస్ట్రీస్ లి., కర్నూలు.

ASP/N-3



"ఏవిటీ!
ఇంట్లో
# అమృతాంజనం
లేదా?

మరి యీ దిక్కుమాలిన జలుబుకు నేనేం చేసేది?"

ఏమో ఎప్పుడు అవసరమొస్తుందో ఎప్పుడూ అమృతాంజనం దగ్గర వుంచుకోవటం ఉత్తమం. అమృతాంజనం యింట్లో వుందంటే మీరు నిశ్చింతగా వుండవచ్చు.




అమృతాంజన్ లిమిటెడ్
14/15 లజ్ చర్చిరోడ్డు, మద్రాసు-4
బొంబాయి-1, కలకత్తా-1, న్యూఢిల్లీ-1.

IWT-AM 1880 a

తప్పక చూడండి!

నవీన చిత్రా వారి...

# సవతి కొడుకు



కథ, స్క్రీన్ ప్లే - దర్శకత్వం
Y. రంగారావు.





STUDIO Kethi-.
REVATHI

ఆంధ్ర: మహాలక్ష్మి పిక్చర్స్, సీడెడ్: భాస్కర్ పిక్చర్స్ నైజాం: శ్రీ నేషనల్ ఆర్ట్ పిక్చర్స్

